తత్త్వములందెక్కువ భేదము లేకున్నను, మోక్షావస్థయందు శివునితో సాయుజ్యమును జెప్పుచు, జీవబ్రహ్మలకైక్యము దానికన్న నెక్కువగా నంగీకరించినది*. మూఁడవదియగు శాంకరాద్వైతము, మోక్షస్థితిలో మాయాజనితమైన భేదజ్ఞానము పూర్తిగా నశించి నిత్య శుద్ధబుద్ధమైన బ్రహ్మస్వరూపము మాత్రము నిలుచునని చెప్పుచు సర్వాద్వైత మనఁబడుచున్నది.

ఈ ముగ్గురిలో వైష్ణవులు, మోక్షమనఁగా భగవల్లోకములో అతనివంటి దివ్యమంగళవిగ్రహము గలిగి ద్వంద్వాతీతులై యతని కైంకర్యసౌఖ్యము ననుభవించుటయేయని తలఁచిరి గావున, ఆ యధికారమును భగవంతుఁడనుగ్రహించుటకు దృఢమైన భక్తి వారికి చాలును. కాని యీ యవిచ్ఛిన్నభక్తిని సంపాదించుటకును యమ నియమాది సాధనములు కావలయును గాన వారు ప్రపత్తియను వేఱొక సులభమార్గమును వెదకికొనిరి. అనఁగా భగవంతునియెడ తమ సమస్త భారమును అర్పించి నీవే దిక్కని నమ్మియుండుట. అదియును తామే చేయుటకు చేతఁగానివారు యోగ్యుఁడగు గురువు నాశ్రయించి, యతఁడు భగవంతునియెడఁ దనకుఁగల చనవుచే సిఫారసుచేయఁగా ఆ భగవంతునికి దయగలిగి తప్పులను క్షమించి తమ్ముద్ధరించి ముక్తి నిచ్చునని నమ్మిరి. ఇదే ఆచార్యనిష్ఠ ప్రపత్తి యనఁబడును. ఎట్లును వారికిఁ గావలసినది సామాన్యముగ అహంకార మమకారాదులను వర్జించి భగవంతునియెడ దైన్యము స్థిరముగా నుండుటకు ఎంత దేహేంద్రియ మనోదండనలు ముఖ్యమో అంతేకాని, యంతకు మీఱి హఠయోగాదులు సాధింపవలసిన పనిలేదు గావునను యోగులు పరమఫలముగాఁ జెప్పునట్టి యద్వైతానుభవమునందు వారికి నమ్మికలేదు గావునను వా రా మార్గమును వదలిరి. కావుననే శ్రీవైష్ణవులు వ్రాసిన యోగశాస్త్ర గ్రంథ మొకటియుఁ గానరాదు. నాథమునులు 'యోగరహస్య'మను గ్రంథమును వ్రాసిరఁట కాని యది యింకను బైలుపడలేదు. ఎట్లును ఇప్పుడు పాతంజలయోగసూత్రములు, యోగతత్త్వోపనిషత్తు, హఠప్రదీపక మొదలగు గ్రంథములు చెప్పునట్టిదియు, ఇప్పుడును సామాన్యముగ యోగులనఁబడువా రాశ్రయించినదియును అగు యోగవిద్యకును శ్రీవైష్ణవాద్వైతులకును సంబంధము గానరాదు.

ఇఁక శంకరుల యద్వైతము యోగసాహాయ్యము లేనిది బ్రతుకుటయే కష్టము. ఎందుకనఁగా, వారి సిద్ధాంతము సమస్తమును మిథ్యయనియు, శుద్ధ నిర్గుణ బ్రహ్మయే సత్యమనియు, ఈ మిథ్యాజ్ఞానము నశించి శుద్ధబ్రహ్మముగా నిల్చుటయే మోక్షమనియు చెప్పుచున్నది. అనఁగా, ఆ మోక్షావస్థయందు తెలిసికొనుకర్త తెలియఁబడు కర్మము అను భేదమేలేక కేవలము తెలివిగామాత్రము నిలిచియుండుట. ఎన్ని ప్రమాణములు చెప్పినను ఎంత వాదించినను అనుభవప్రమాణము లేనిది యీ సిద్ధాంతము నమ్ముట కష్టము. అట్టి జ్ఞాతృజ్ఞేయశూన్యమైన జ్ఞానావస్థ సాధ్యమనియు, అసంప్రజ్ఞాత సమాధిస్థితి యదియే యనియుఁ జెప్ప యోగశాస్త్రము దానిని సాధించు మార్గములను తెలుపుచున్నది. కావున శాంకరాద్వైతులు యోగము వదలలేరు.

అద్వైతానుభవము విషయమున వీ రిరువురికి నడుమనున్నవారు వీరశైవులు. శివతత్త్వము సహజమగు 'శక్తి'బలముచే 'లింగ'మనియు, 'అంగ'మనియు

---

*Vide Bhandarkar's Vaishnavism and Saivism, p. 135.

రెండుగాఁ బరిణమించును. లింగము పూజ్యదేవత; రుద్రరూపము. అంగము జీవాత్మ. 'శక్తి'గూడ 'కళ'యని, 'భక్తి'యని రెండు తెఱఁగులగును! కళ శివునియందుండి సృష్టికిని, సంసారమునకును కారణమగును. భక్తి జీవునియందుండి ముక్తి హేతువగును. ఇట్టి యవిచ్ఛిన్న భక్తిచే జీవునికి శివునితోడి 'సామరస్యము', అనఁగా, ఆనందమయమైన ఐక్యము, కలుగును. అదే ముక్తి. కాని యీ యైక్యము శాంకరాద్వైతుల యైక్యమువలె జీవునికి సంపూర్ణముగా ఆత్మనాశము గలిగించి పరబ్రహ్మతో నేకీభవింపఁజేయదు. జీవునికి ఆ నానందమనుభవించుచున్నానను జ్ఞానము గలదు*. వైష్ణవాద్వైతులవలె వేఱుగా నుండక, పాలలో నీరు చేరినట్లు గాఁబోలు, శివునితో సాయుజ్యమునందును దీని కఖండభక్తిసాధనము ఆవశ్యకము గావున, అందుకు వారికి యోగసాహాయ్యము తప్పనిది. ఇట్టి యద్వైతము నభ్యసించువారు శివయోగు లనఁబడిరి. తక్కిన యోగులు వట్టి యోగులు.

శంకరాద్వైతము బ్రాహ్మణజాతియందే వ్యాప్తిఁగాంచినది. బ్రాహ్మణులలో ననేకులు ఇప్పటికిని శాంకరులే. కాని వారియందు యోగవిద్య వ్యాప్తిఁగాంచలేదు. అద్వైతము సిద్ధాంతమందే కాని, వారి వ్యవహారమందు లేదని చెప్పితిని. ఇదిగాక అనూచానముగా జాతిసిద్ధమై వచ్చిన వైదిక కర్మానుష్ఠానమును వదలుట వారికి సాధ్యముకాలేదు; బ్రహ్మజ్ఞానము సంపూర్ణముగఁ గలిగి విరక్తుఁడైనవానికి తప్ప తక్కినవారికి కర్మత్యాగమును సంఘ మనుమతింపలేదు. కర్మత్యాగము, సంసార విరక్తియుఁ గలవారికి తప్ప యోగాభ్యాసము సాధ్యముగాదు. సన్న్యాసాశ్రమమును స్వీకరించినవారికిని సంఘముపై నధికారము, మతముల యాజమాన్యము మొదలగునవేకాక, త్రికాలపూజ, అభిషేకములు, సమారాధనలు, మెరవణులు మొదలగు సన్న్యాసధర్మములు ఇంటికర్మములకన్న నధికములైనవి. కావుననే అద్వైత బ్రాహ్మణులలో యోగు లపురూపమైనారు. ఎట్లును కర్మభూమియగు దక్షిణ దేశములో వా రరుదు.

ఇఁక వీరశైవము బ్రాహ్మణప్రాబల్యము సణఁచుటకై పుట్టిన మతము. ఈ మతము నాశ్రయించుట కందఱును అర్హులు. బ్రాహ్మణులలో నున్నన్ని నిత్యకర్మముల గలాటా వారిలో లేదు. మనలోవలె వారిలోను మఠములలో నధికారము వహించిన కర్మఠసన్న్యాసులున్నారుగాని, సామాన్యజాతులగుంపే వారిలో బలమగుటచేతను, అద్వైతులలోవలె నిర్గుణోపాసన చేయకున్నను సగుణోపాసనచేతనే కాలక్రమమున బ్రహ్మానుభవము సిద్ధింపగలఁడను అనుకూలము లేదు గనుక భక్తి యఖండముగా లేక మోక్షము సిద్ధింపదు గావునను వారిలో తప్పక యోగవిద్య ననేకు లాశ్రయింపవలసివచ్చినది. యోగమును పూర్తిగా సాధింపఁగల్గినవా రనేకులు లేకపోవచ్చును గాని, సాధింపఁ బ్రయత్నించినవారు తక్కిన మతములకన్న నా మతములో నెక్కువ గలరని తలఁచుచున్నాను.

ఇట్టి శివయోగులలో కొందఱూళ్ళయందు, మఠములలోనో, గృహస్థులుగానో వసించియుండినను, అనేకులు ఆలుబిడ్డలులేని బ్రహ్మచారులై అడవులలోనో, కొండలయందో వసింతురు. స్వర్ణవాదవిద్య వీరిలో చాలమంది యెఱుఁగుదురను ప్రతీతి గలదు. విరక్తులై యోగాభ్యాసులైనవారి కీ కృత్రిమస్వర్ణమందాశ యేల కల్గినదని మన కాశ్చర్యము గలుగును. ప్రాయశః హఠయోగసాధనకు దేహశక్తియు నారోగ్య

*Vide Bhandarkar's Saivism, p. 134 to 137.

మును ప్రధానములు గావున, దానికిఁ గావలసిన పుష్టాహారములు ఎక్కువ కష్టము లేక సంపాదించుటకును, ఆయుర్వేదముప్రకారము స్వర్ణమును భస్మాదిరూపముల చేత నిత్యమును సేవించుట చాలమంచిది గావున దానికిని, సహజమైన బంగారు దొరకుట కష్టమై, కృత్రిమముగా తయారుచేయవలసిన యక్కర వారి కేర్పడి యుండును. కాని కృత్రిమమైన బంగారునకు సహజమైనదాని గుణములుండునా యను ప్రశ్న కలుగును. చూచినవారు ఉపయోగించినవారు ఎవరైన దీని కుత్తర మీయవలయునే కాని నే నెఱుఁగను.

వేమన బీదఱికమును బోఁగొట్టుకొనుటకై బంగారు తయారుచేయు విద్య నేర్వఁగోరి వీరి నాశ్రయించియుండునని యూహించితిమి. వా రా విద్యను సామాన్య ముగ నెవరికినిఁ జెప్పరు.

"దాతవ్యం గురుభక్తాయ నదద్యాద్దుష్టమానసే"
"వనితాపుత్రమిత్రాదిగోప్యం సిద్ధిప్రదాయకమ్"*

అని వారు భావించిరి. అనేక సందర్భములలో నిట్లు విషయములను గుప్తములుగా నుంచుట, తమ కొకవిధమైన విలువను, గౌరవమును సంపాదించుకొనుటకే కాని, వేఱు కాదు. ఈవిషయము ప్రాచీనులే యంగీకరించిరి. చూడుఁడు—హఠయోగులకు, దేహము లోపలిభాగమును శోధించు ధౌతి, నౌళి మొదలగు కర్మము లాఱుగలవు.

"కర్మషట్కమిదం గోప్యం ఘటశోధన కారకమ్"
(హఠప్రదీపిక, ద్వితీయోపదేశము, ౨౩ ప.)

అని పై కసరత్తులుగూడ రహస్యముగ నుంచవలెనని శాసనము గలదు. పై శ్లోకమునకు వ్యాఖ్యచేయుచు బ్రహ్మానందయోగి—

"గోపనాభావే షట్కర్మకమన్యైరపి విహితంస్యాదితి యోగినః పూజ్యత్వాభావః ప్రసజ్యే తేదిభావః" (గుప్తముగా నుంచనియెడల నీకర్మము లందఱును జేయఁగల్గుదురు గావున, యోగికి పూజ్యత లేకపోవునని భావము).

అని వ్రాయుచున్నాఁడు. ఎట్లును స్వర్ణవాదమువంటి విలువగల విద్యలను రహస్యముగా నుంచుట మనుష్యస్వభావము. ఇట్టిదానిని సంపాదించుటకై వేమన్న చాల గురుసేవ చేసియుండును. వారును 'గోప్యం గోప్యం మహాగోప్యం' అని యెన్నో బాసలు చేయించుకొని యితనికేదో కొంత తెలిపియుందురు. ఇంత కష్టపడి తాను సాధించిన విద్యను స్పష్టముగా బహిరంగపఱుప నిష్టములేక కాఁబోలు, ఇతఁడును, ఈ విద్యనుగూర్చిన పద్యములన్నియు ఇతర వాదగ్రంథములందలి పద్యములవలెనే, స్పష్టముగాక చేసినాఁడు.

ఇట్లు బంగారమును సాధించు నాశకుతోడు తీవ్రమైన తత్త్వజిజ్ఞాస గలవాఁ డగుటచే, వేమన పైవారిని సేవచేయునప్పుడు వారి నడతలను చక్కఁగా గమనించి యుండును. సంసారులకును, వారికిని గల భేదములు చూచి యాశ్చర్యపడి యుండును. వారికి అడవి, యూరు, పగలు, రాత్రి యను భేదములేదు; ఆహారమునకై యీ వస్తువులు కావలెనని, కాని యీ కాలమునఁ గావలెనని కాని నియమము గానరాదు; ఉపవాసములకు వెఱవరు; రోగాద్యుపద్రవములు వారిని

---

* గురుభక్తునకే విద్య చెప్పవలయును. దుష్టమనస్సు గలవానికి చెప్పరాదు. భార్య, పుత్రులు, మిత్రులు మొదలగువారికిని దీనిని దెలుపక గుప్తముగా నుంచిన సిద్ధించును (దత్తాత్రేయతంత్రము, పే. ౧౧౬).

జేరవు; దృఢకాయులుగా నుందురు; చలి, గాలి, యెండ, వాన, దేనికిఁగాని వెఱవరు; సమాధిలోఁగూర్చున్న గంటలకొలఁది బహిఃప్రపంచజ్ఞానమే లేకయుందురు; తామేదో మహానంద మనుభవించువారైనట్లు కానవచ్చి లౌకికములైన సుఖముల నన్నింటిని అసహ్యముతోఁ జూతురు; నిత్య బ్రహ్మచారులుగా నుందురు; సర్వ సందేహములను గలిగించు నిత్యకర్మములు, విగ్రహపూజలు మొదలగువానిలో పాల్గొనక, తాము బ్రహ్మస్వరూపము నెఱింగినట్లు మాటలాడుదురు; జాతిభేదాదుల గమనింపరు; సృష్టిస్థితిలయములను గుఱించి మనకెల్లఁగలుగు సందేహములన్నియు తీర్చుకొన్నవారివలె నుందురు; ఏదైనను ప్రశ్నించిన మనకర్థము గాకున్నను తమకు సందేహము లేక ప్రత్యుత్తర మిత్తురు; సామాన్యులకు లేని కొన్ని విచిత్రములగు శక్తులు సిద్ధులు గలవారని ప్రసిద్ధితో నుందురు! ఇట్టివారిని జూచినప్పుడు తనకుఁ గల తత్త్వసందేహములను దీర్చుట వీరికి తప్ప తక్కినవారికి సాధ్యముగాదని నమ్మి, ఏమైనను జేసి, యెంత కష్టమైనను పడి, వారివంటి బ్రహ్మజ్ఞానమును తానును సంపాదించి యోగి గావలయునని, ఇదివఱకే యాలుబిడ్డలపై రోఁతగలిగిన వేమన్న నిర్ణయించెను—

> "ఆ. ఇహమున సుఖియింప హేమతారక విద్య
> పరమున సుఖియింప బ్రహ్మ విద్య;
> కడమ విద్యలెల్ల కల్ల మూఢుల విద్య..." (౪3౬)

అని నిశ్చయించుకొని, యట్టి యోగులలో ముఖ్యుఁడుగా నుండినవాఁడు గాఁబోలును, లంబికాశివయోగి నాశ్రయించెను. ఇతని శ్రద్ధకు సంతసించి యతఁడును నరహస్య ముగు యోగవిద్య నుపదేశించెను. దానిని గూర్చి ముందు మనవి చేయుదును.

శ్రీః

ఐదవ యుపన్యాసము

# వేమన యోగసిద్ధి—మత ప్రచారము

వేమనకు లంబికాశివయోగివలన యోగమార్గోపదేశము లభించెనని చెప్పితిని. ఆ యోగ సాహాయ్యముచే వేమన యేమి సాధించెనని యూహించుటకు ముందు యోగ సామాన్యస్వరూపమును గొంతవఱకు నెఱుంగవలసి యున్నది. సాధకునకుఁ దప్ప తక్కినవారికి దీనినిగురించి చర్చించు నధికారమే లేదు గావున నీ విషయమును దడవుటకే భయపడుచున్నాను. కాని విధిలేదు. బహిరంగమైన బుద్ధితో ఎంత నాకు గ్రహించుటకు సాధ్యమో యంత మనవి చేయుచున్నాను.

సకల జగత్కారణమైన మూలవస్తువొకటి కలదని మన ప్రాచీనులు వేలకొలఁది యేండ్ల క్రిందనే గ్రహించిరి. దాని తత్త్వము నెఱిఁగిన పక్షమున, సృష్టియందలి సందేహములకెల్ల నందు ప్రత్యుత్తరములు లభించుననియు, బంధములన్నియు నుడుగుననియుఁ దలఁచిరి—

“భిద్యతే హృదయగ్రన్థి శ్ఛిద్యన్తే సర్వసంశయాః
క్షీయన్తే సర్వకర్మాణి తస్మిన్ దృష్టే పరావరే”*

అది సగుణమయినను నిర్గుణమైనను శూన్యమైనను దాని స్వరూపము ననుభవపూర్వకముగ నెఱుఁగక తీఱదని తేలినది. కాని దాని నెఱుఁగుట యెట్లు? మితమైన శక్తిగల కన్ను ముక్కు మొదలగు బహిరింద్రియములచే సాధ్యముగాదు. సాధ్యమైనచో అమితమైన ప్రభావముగల మనస్సను అంతరింద్రియముచేతనే కావలయును. కాని యీమనస్సు చంచలమైనది. నిమేష కాలమైనను ఒకవిషయమును ధ్యానించు దార్ఢ్యములేనిది. దానికితోడు శరీరమందును సంసారమందును గలుగు వివిధావస్థలు దానిని ఒకచోట నిలుపనీయవు. కావున మనస్సు ఈ దేహమునకును బహిస్సంసారమునకును లోబడక తనంతట అఖండముగా నిలిచి కార్యమును నిర్వహించు మార్గమొకటి వెదకవలసివచ్చెను. అదేయోగము—

“యదా పఞ్చావతిష్ఠన్తే జ్ఞానాని మనసాసహ
బుద్ధిశ్చన విచేష్టతి తామాహుః పరమాంగతిమ్,
తాంయోగమితి మన్యన్తే స్థిరామిన్ద్రియధారణామ్” —కఠోపనిషత్తు, ౬౧౦

(ఎప్పుడు పంచేంద్రియములు మనసుతోఁజేరి నిలుచునో, బుద్ధియల్లాడదో, అదియే పరమగతి; అట్టి యింద్రియధారణమే యోగమందురు.)

బ్రహ్మధ్యాన మావశ్యకమనియు, దానికి మనోనిగ్రహము దేహదండనమును

---

*ఆ పరావరమూర్తిని జూచిన వెంటనే హృదయపు ముడి వదలును; అన్ని సందేహములును దీరును; అన్ని కర్మములును క్షయించును. ముండకోపనిషత్తు, ౨—౨—౮.

చేయక తీఱదనియు నన్ని దేశములవారు నంగీకరించిరి. కాని, ఆ దేహమనోనిగ్రహమార్గమును ఉపక్రమోపసంహారములతో సక్రమమైన శాస్త్రముగా నేర్పఱిచిన గౌరవము, నే నెఱింగినంతవఱకు, హిందువులకే చెల్లవలసియున్నది. దేహమును స్వాధీనపఱచుకొనవలయునని నానావిధముల దండించి, మనసును బిగఁబట్టి బహిరంగములనుండి విడఁదీసి, లోపలధ్యానమునకుఁ బూనుకొన్నప్పుడు, పై రెంటికిని కలుగు అనేక పరిణామములును, అనుభవములును చక్కఁగా గమనించి, అందుఁగలుగు అనిష్టఫలములు నివారించి, ప్రధానోద్దేశమగు పరబ్రహ్మానుభవమును సాధించుట కెన్నిపద్ధతులు గావలయునో, యవన్నియు ననుభవపూర్వకముగా యోగ శాస్త్రకారులు వ్రాసిరి.

యోగాభ్యాసుల మొదటి ధర్మము తమయందలి దుర్గుణములను వదలుట. యోగ్యత సంపాదించుటకు మొదలు అయోగ్యతను పోఁగొట్టుకొనవలయును గదా? దేహబలమును సంపాదించుటకు మొదలు రోగములకు మందుదిన్నట్లు. ఒకరిని హింసింపక, అసత్యమాడక, ఒకరిసొమ్ము దొంగిలింపక, ఇంద్రియలోలుఁడుగాక, తనకెంత ముఖ్యముగా కావలయునో యంతకన్న నెక్కువ దానమిచ్చినను గ్రహింపక యుండుట మొదటిమెట్టు. ఇదే యమ మందురు.

తరువాత పరిశుద్ధముగా నుండుట, సంతోషము, తపస్సు, వేదశాస్త్రములు చదువుట, భగవద్భక్తి—వీనిని సాధింతురు. ఇవి నియమ మనఁబడును.

ఇట్లు దేహమనస్సులు కొంతవఱకు పరిశుద్ధములైన తరువాత దేహమం దిది వఱకున్న రోగములు నశించుటకును, క్రొత్తవి రాకుండుటకును శ్రమము, సహించు శక్తి గలుగుటకును కొంత వ్యాయామము చేయుదురు. వ్యాయామ మనఁగా 'గరిడీ' లలోఁగాని, ఇప్పటి స్కూళ్ళలోఁగాని చేయునట్టిదిగాదు. చేతులు, కాళ్ళు మొదలగు నవయవములు ప్రత్యేకముగాఁగాని, మొత్తముగా దేహమునుగాని, యేదైన నొకగతిలో పలుమాఱు ఆడించుట యిప్పటి పద్ధతి. ఇందువలన కండలు మాంసము బలసి దేహమున క్రొవ్వుపట్టును. ఒక విధమైన నిలుకడలేని చురుకుఁదనము గలుగును. యోగులయుద్దేశమదికాదు. శ్రమమును సహించుట, దేహమందు జిడ్డుపెరుగనీక లఘువుగా చేసికొని నెమ్మదిని సంపాదించుట—ఇవి వారు కోరునది. కావున ఏదో యొక కష్టమైన తీఱులో చాల ప్రొద్దు నిలుచుకొని యుండుట, కూర్చుండుట, పరుండుట, వారు సాధింతురు. వీని నాసనము లందురు.

ఇంతైనను దేహమున కెప్పుడును చలనమునిచ్చి తన్మూలమున మనస్సును చలింపఁజేయు వస్తువొకటి గలదు. అది వాయువు. దానిని స్థిరముగా నిలుపనిది మనస్సు నిశ్చలము గానేరదు.

"చలేవాతే చలంచిత్తం నిశ్చలే నిశ్చలంభవేత్"

(గాలిగదలిన మనసుకదలును; అది నిలిచిన నిదినిలుచును.)

(హఠయోగప్రదీపిక, ఉపదేశము ౨, ప. ౨)

కావున లోని యూపిరి బైటికిఁ బోనీయక, బైటియూపిరి లోనికి రానీక లోపలనే పట్టి నిలుపుట యావశ్యకము. దీనినే ప్రాణాయామమందురు. దీనిచే మనస్సు నావరించియున్న మాలిన్యములన్నియు నశించు నందురు.

తరువాత కన్ను, ముక్కు మొదలగు పంచేంద్రియములు తమకు విషయము లైన, రూపము, వాసన, మొదలగు వానియెడఁ బోనీయక మనస్సెప్రక్కఁబోయిన నా ప్రక్క పరాధీనములై యుండునట్లు సాధింపవలయును. ఇదే ప్రత్యాహారము.

ఇవి యైదును బైటి సాధనలు.

ఇట్లు శరీరము స్వాధీనమై మనస్సునకు చాంచల్యము తగ్గినపుడు తమకిష్ట మైన యే వస్తువునందైన మనసు నిలుపవలయును. ఇది ధారణ. అది తప్ప తక్కిన వృత్తులందు మనసును పోనీయక నిలుపుట ధ్యానము. ఈ రెంటియందును "నేను, దీనిని, ధ్యానించుచున్నాను' అను ధ్యాత, ధ్యేయము, ధ్యానము అను మూఁడు పదార్థములు గలవు. ఈ ధ్యానము ఇట్లే సాఁగనిచ్చినయెడల మనము ధ్యానముచేయు వస్తువు మాత్రము నిలిచి, నే ననుకర్త, ధ్యాన మనుక్రియ ఈ రెండును అంతరించును. దీనినే సమాధి యందురు. ఇవే అష్టాంగ యోగము.

ఈ సమాధి రెండువిధములు: సంప్రజ్ఞాతమని; అసంప్రజ్ఞాతమని. మొదటి దానిలోఁ గూర్చున్న యోగికి మొదలు ధ్యేయవస్తువుయొక్క స్థూలరూపము గోచరించి క్రమముగా దాని సూక్ష్మరూపముగూడ స్పష్టమగును. ఆ మూలప్రకృతి గోచరించినపుడు 'ఋతంబర' యను నొకవిధమైన ప్రజ్ఞ కలుగును. దానిచే యదార్థ జ్ఞానము గలిగి సందేహములన్నియు నివర్తించును. శ్రుతిప్రమాణముచేతను, అనుమాన ప్రమాణముచేతను గలుగు తెలివికన్న ఈ 'ఋతంబర' యను తెలివి గొప్పది. ప్రత్యక్షము, పరోక్షము, భూతము, వర్తమానము, భవిష్యత్తు అను భేదము లేక యన్ని విషయములును సాక్షాత్తుగా నిందుగోచరించును. ఈ సంప్రజ్ఞాత సమాధిగూడ అభ్యాస బలముచే క్రమముగా నశించి అసంప్రజ్ఞాతసమాధిగా మాఱును. ఆ యవస్థలో ఆ మిగిలిన ధ్యేయవస్తువు స్ఫూర్తియగుటగూడ నశించి కేవల నిర్మలజ్ఞానముగా మాత్రము శేషించియుండును. ఇవే కైవల్యావస్థ. ఇవి పాతంజలియోగశాస్త్రముచే గ్రహింపఁగల ముఖ్యవిషయములు.

కాని యీ యభ్యాసప్రవాహములో ముఖ్యమైన యీశ్వరవ్యక్తి యెక్కడనో మునిఁగి పోయినాఁడు! ఈ మతము ప్రకారము ఈశ్వరుఁ డక్కరయే లేదు. ఉన్న, యోగసాధనమునకు మేలు. అంతే. నామరూప మయమైన యీ ప్రపంచ మందలి పరిణామములు, తాపములు, సంస్కారములు, పరస్పరవిరుద్ధములగు సత్త్వరజస్తమో గుణములు—వీనిచేత పుణ్యమైనను పాపమైనను, సుఖమైనను దుఃఖమైనను అంతయును వివేకముగల వానికి దుఃఖముగానే తోఁచును గావున* ఇన్ని వ్యవహారములకు హేతువైన చిత్తమును స్వాధీనము చేసికొనుట, దాని కల్పనలు తన్ను ఆవరింపక యుండునట్లు అణగించుట, ఇవే పరమార్థమని వీరిమతము. అదే మోక్షము. ఇట్లగుటచే, మూలకారణమును వెదకఁ బ్రయత్నించి, తుదకది దొరకక యీ కష్టములనుండి తప్పించుకొను మార్గమును వెదకుకొని వీరు కృతార్థుల మనుకొనిరా యని సందేహము గలుగుచున్నది. కాని, సంప్రజ్ఞాత సమాధిలో నున్నపుడు అతీతానాగతజ్ఞానము, అపరోక్షజ్ఞానము, విచిత్రమగు ప్రతిభయుఁ గలుగు నని చెప్పుదురు గాన, అదియే సత్యమగునేని మనకు సామాన్యముగఁ గలుగు ప్రశ్నలకన్నిటికిని అందు ప్రత్యుత్తరము దొరకవలసి యుండును. ఐనను యోగు లెవరును ఆ ప్రత్యుత్తరములు నిస్సందేహముగాఁ జెప్పి మనల నుద్ధరించి యుండ లేదు. కావున నీ యోగశాస్త్ర కైవల్యము, అప్పులవారి బాధలు పడలేక యింటి మూలలో దాఁగుకొని తలుపువేసుకొనుటవంటిది తప్ప, నిజమైన జ్ఞానమోక్షమగునా యని శంకింపవలసియున్నది. ఇట్లు సందేహించిన వారికిట్లు ప్రత్యుత్తరము గలదు:

---

*చూ. పాతం. యోగ. సూ. ౨, పా. సూ. ౧౫.

# వేమన యోగసిద్ధి—మత ప్రచారము

"సోయమేవాస్తు మోక్షాభ్యోమాస్తుతావా౽పిమతాన్తరే,
మనః ప్రాణలయే కశ్చిదానన్ద స్సంప్రవర్తతే"
(మతాంతరు లిది మోక్ష మననిందు, కాదన నిందు. మనస్సు ప్రాణమును లయించె నేని యొకవర్ణింపరాని యానందము మాత్రమున్నది.)

(హఠయో., ఉప. ४, ప. 30)

కాని మన ప్రశ్న కిది ప్రత్యుత్తరముగాదు. మఱియు, యోగశాస్త్ర ప్రవర్తకుఁడగు పతంజలి యీ 'ఆనంద' మను పేరే యెత్తలేదు. 'దుఃఖమేన సర్వం వివేకినః' అని చెప్పిన యతఁడు సుఖదుఃఖరూపమగు చిత్తధర్మ నాశమే మోక్షమనియెను. ఆ ముక్తావస్థలో ఆనందమును గీనందమును ఒకటియు లేదని భోజరాజు స్పష్టముగా వ్రాసెను.* అద్వైతులు ముక్తావస్థయందు సచ్చిదానందమయమగు బ్రహ్మసాక్షాత్కారము—అనఁగా, తానే బ్రహ్మగానుండుట—కలుగుననిరి. శైవులగు వద్వైతులును ఇట్లే తలంచిరి—

"క. అమనస్క సౌఖ్యమద్భుత
మమలం బనదృశ మఖండ మక్షయ మవిత
ర్క్య మచంచల మమృతమయం
బమితంబది యెఱుఁగుదురు మహాసిద్ధవరుల్"

(శివయోగ సారము, ४ ఆశ్వాసము)

ఇట్లు కేవల యోగులకును అద్వైత యోగులకును అసంప్రజ్ఞాత సమాధి ఆనంద రూపమా శూన్యరూపమా యను విషయమున భేదముకలదు గాని యద్వైత విషయమున—అనఁగా, రెండుగాక యొకటిగా మిగులుటలో భేదములేదు. ఈశ్వరుని కేవల మొకసాధనముగా మాత్రము గొని సుఖదుఃఖములు రెంటినుండియు విడుదల పొందఁ గోరిన కేవలయోగులను వదలితిమేని, ఈశ్వరసాక్షాత్కారమే ప్రధాన ఫలముగాఁగొని సాధించు నితర యోగులందఱును ఆ కడపటి సాధనావస్థలో ఆనందమున్నదనియే చెప్పెదరు. అది యట్లుండె.

అట్టి కైవల్యమును శాంతమార్గమున సాధించుటకు చాల దినములు పట్టును. అనేకుల కాయువు చాలదేమో యను భయము గలుగును. కావున సాధ్యమైనంత త్వరలో దానిని సాధించి ముక్తి పొందఁగోరువారు దేహమనస్సుల నెక్కువ బలవంత పెట్టి లొంగఁదీయుదురు. ఈ మార్గమునకే హఠయోగమనిపేరు. 'హ'కారమునకు ఊర్ధ్వగతియగు ప్రాణవాయువును 'ఠ'కారమునకు అధోగతిగల అపాన వాయువును అర్థమఁట. ఈ రెంటికిని ఐక్యము సంపాదించి సాధించుట హఠయోగము. కావున వీరికి దేహ మనస్సులను దండించు ఆసనప్రాణాయామములు ముఖ్యములు. ఇదిగాక దేహమందలి రోగములను నశింపజేయుటకును, శ్వాసకోశములు, కడుపు, నాసారంధ్రములు మొదలగు వానియందలి కఫాదిదోషములను బోఁగొట్టుకొనుటకును, ధౌతి, నౌళి మొదలగు కర్మములను, బ్రహ్మచర్యమును సాధించుటకు వజ్రోళిమొదలగు యోగములును వీరు సాధింతురు. ఈ మార్గములచే సాధింపఁగా కడుపుక్రింది మూలాధార మందుండెడు కుండలిని యనుశక్తి, నిద్రించుచుండెడిది, పైకిలేచును. అప్పుడు కుడియెడమ ముక్కులందలి ఇడ, పింగళ అను నాడులలో సహజముగా సంచరించు వాయువు, ఈ రెంటి నడుమనున్న

*చూ. పా. యో. సూ. భోజరాజ్యవాఖ్య, కడపటి సూత్రమునకు.

మమమ్న యను నాడిమూలముగా ప్రవహింపఁగల్గును. దేహమందు మూలాధారము మొదలు బ్రహ్మరంధ్రమువఱకును ఆఱు చక్రములు గలవు. కుండలినీ శక్తి చలించి సాధనబలముచే పైచక్రముల నన్నిటిని క్రమక్రమముగా భేదించి కట్టకడపటిదగు సహస్రారచక్రమును జేరఁగా, అందు బ్రహ్మ సాక్షాత్కారమై యసంప్రజ్ఞాత సమాధి కలుగును. అదే జీవన్ముక్తి. ఈ కుండలిని యుద్బోధముగానిది బ్రహ్మస్థానమును బొందవీలులేదు.

"యేన మార్గేణ గన్తవ్యం బ్రహ్మస్థానం నిరామయమ్
ముఖేనాచ్ఛాద్య తద్ద్వారం ప్రసుప్తా పరమేశ్వరీ"

(బ్రహ్మస్థానము నేమార్గముతోఁ జేరవలయునో యామార్గపు ద్వారమును ముఖముతో నడ్డగించి మూసి, ఆ పరమేశ్వరీశక్తి (కుండలిని) పరుండి యుండును.

(హఠయోగ., ఉప. 3, ప. ౬)

కావున దానిని లేపుట ముఖ్యము. ఇట్లు హఠయోగము సాధనము ; అసంప్రజ్ఞాత సమాధి సాధ్యము. దానినే రాజయోగ మందురు.

కాని హఠయోగపద్ధతియందు రాజయోగసిద్ధికి విఘ్నముగలిగించు సన్నివేశములనేకములు గలవఁట. హఠయోగము కొన్ని సిద్ధులనిచ్చును. దాని నభ్యసించువారికి చావుండదఁట. ఆధునిక శారీరశాస్త్రజ్ఞులు చావనఁగా నేమిగా నిశ్చయించిరో యెఱుఁగనుగాని యోగుల వాదము సులభమైనది. వాయువు గలుగుట బ్రతుకు ; అది పోవుట చావు ; కావున దానిని బోనీక బిగఁబట్టితిమేని చావెక్కడిది ?

"యావద్బద్ధో మరుద్దేహే యావచ్చిత్తం నిరాకులమ్.
యావద్దృష్టిర్భ్రువోర్మధ్యే తావత్కాల భయంకుతః ?"

(హఠ., ఉప. ౨, ప. ४౦)

"తే. కట్టుపడియుండు నెందాఁక గాలిమేన,
చిత్తమెందాఁక నెందును జెందకుండు,
కదలదెందాఁక భ్రూమధ్య కలితదృష్టి,
యపయుఁడందాఁక ప్రాణభయంబులేదు" (శివయో., 3 ఆశ్వా.)

ఇదిగాక ఆకాశసంచారము, కామరూపము, పరకాయప్రవేశము మొదలగు విచిత్రసిద్ధులు హఠయోగ సాధనచే లభించునఁట. కావున సాధకులు ముఖ్యఫలమగు సమాధిని విడిచి వీనితోనే తృప్తిపడియుండుట స్వాభావికము. అట్లగుటచే హఠయోగమును బోధించువారందఱు దీనికి ఫలము రాజయోగమే యని తలఁచి సాధింపవలయునని హెచ్చరిక చేయుచున్నారు. ఆంధ్రయోగినులలో అగ్రగణ్యురాలగు తరిగొండ వెంకమ్మ యిట్లు చెప్పినది—

"మఱికొందఱీ మహామహిమ గానకయు
గురు నెఱుంగక కర్మగురు చెంతఁజేరి,
గాథకుఁజిక్కి దుష్కర్మ మార్గమున
సాధనంబుగ యోగ సరణులఁ దెలిసి,
యలమట నాసనాభ్యాసముల్ చేసి,
చలముస బాహ్యలక్ష్యములు చూపుచును,
కూలంకషము లోని గురిగానలేక,
లాలితంబుగ మంత్రులయహఠ యోగ
ఫలములం గోరుచుఁ బామరులగుచు,

జలబుద్బుదమువంటి జన్మంబులకును
సిద్ధులంగోరి ప్రసిద్ధమై యోగ
సిద్ధాంతమందు సుస్థిరమతిలేక,
అగణిత విషయసుఖాసక్తిమీఱ,
తగమణిమంత్ర సిద్ధక్రియల్ నేర్చి,
మఱి పామరులకెల్ల మహిమలంజూపి,
తిరిగెడు వారలీదేహవాసనలు,
వీడఁగనేరరు, వేదాంత మందుఁ,
గూడనేరరు వట్టికుంభన గాని..."

(రాజయోగసారము, ద్వితీ. ప్రక.)

కాని హఠయోగ సాధనము లేనిది రాజయోగము ఫలింపదఁట!

"మ. హఠశూన్యంబయినన్ ఫలింపదమలంబౌ రాజయోగంబొగిన్;
హఠయోగంబును రాజయోగరహితం బౌనేని సిద్ధింప; దీ
హఠరాజంబులు రెండుఁగూడ సతతాభ్యాసంబుఁ గావించు ని
శ్చరనిస్సంశయభవ్యమానసునకున్ సాధ్యంబగున్ సర్వమున్."

(శివయోగసారము, ౨ అశ్వా.)

ఈ హఠవిద్యకే సంబంధించిన 'ఉప' యోగములు రెండు గలవు. మంత్రయోగము; లయయోగము. మంత్రముల జపించుచు తన్మయుఁడగుట మొదటిది: ప్రాణాయామధ్యానములచే దేహము శుద్ధమైనప్పుడు లోపల నొకవిధమైన నాదము అఖండముగా వినఁబడునఁట. బైట మనము విను శబ్దము అహతము. అనఁగా, దెబ్బ గొట్టుటచేఁ గలిగినది. ఇది యనాహతము. అనఁగా, మన మెఱిఁగినట్లు వీరెండు పదార్థముల ఒరయికయును లేకయే కలుగునది—

"మత్త. ఆ యనాహతనాద మెంతయు నుద్భుతంబయి యాత్మలో
మ్రోయుచుండు నిరంతరంబు సముద్రఘోషముభంగి, భృం
గాయుతధ్వని రీతి, వేణునమంచిత స్వరలీల, వీ
ణాయుతంబగు మ్రోఁత చందమునన్ మనోలయహేతువై"

(శివయోగ., 3 అ.)

ఆ నాదమునే వినుచు అందు పునఃప్రాణములను లయింపఁజేయుటయే లయయోగ మందురు. హఠయోగప్రవర్తకుఁడగు 'శ్రీఆదినాథుఁడు' సపాదకోటి లయ ప్రకారములను జెప్పినాఁడఁట! అందులో నాదలయమే ముఖ్యమని తలఁచి హఠయోగులు సద్య మనలను బ్రదికించిరి!

(హఠ. ४, ఉపదే., ప. ౬౬)

వేమన్నకు గురువైన 'లంబికాశివయోగి' యీ హఠయోగుల గుంపునకుఁ జేరినవాఁడు. 'లంబిక' యనునది లంబికాశబ్దభవము. దవడలని యర్థము. వానిపైఁ గల శిరోరంధ్రములో నాలుకను జొనుపవలెను. భ్రూమధ్యమందలి యెడమప్రక్క చంద్రస్థానము గలదు. నాలుకను ఆ చంద్రస్థానము నంటునట్లు చేయవలెను. అప్పుడొక యగ్ని జనించును. దానిచే ఆ చంద్రస్థానమునుండి కరిఁగి అమృతము స్రవించును. దానిని త్రాగిన యోగికి రోగము, చావు, ఆకలి, దప్పి, అలస్యము, నిద మొదలగున వేవియు నుండవు. కాని నాలుక యంతపొడవుగా సాఁగుట యెట్లు? మూఁడు సాధనములు: నాలుకక్రింది నరమును క్రమముగా కోసివేయుట;

వ్రేళ్ళతోఁబట్టి ప్రక్కలకల్లాడించుట; ఆవు చన్ను పిండినట్లుగా లాఁగుట! ఇట్లు కృత్రిమముగా నాలుకను పొడిగించుకొని, పైఁ జెప్పిన లంబికావివరములోఁ జొనిపి క్షణార్థముండినను యోగి విషవ్యాధిమృత్యువులను దప్పించుకొనునఁట!* దీనినే లంబికాయోగమనియు, ఖేచరిముద్రయనియుఁ జెప్పుదురు. కాని యిది బాహ్యఖేచరి. అంతఃఖేచరి వేఱట. కన్నులు సగము మూసి దృష్టిని నాసాగ్రమందు నిలిపి చూచిన మండలాకారమైన తేజోదర్శనమగును: ఇందు మనఃప్రాణములు లీనముచేసి ఱెప్పలల్లార్పక 'చూచునతండు జగద్గురుండగు' ననియు, నదియే నిజమైన ఖేచరియనియుఁ జెప్పుదురు; మఱియు—

"మ. ధరణిం గొందఱు సద్గురూక్తగతి నంతఃఖేచరీముద్రికా
వరభావం బెఱుఁగంగ నేరకకదా వాలాయమున్ బాహ్య ఖే
చరియుం బట్టి నిరూఢసాహస మహాసంరంభ విస్రంభ ని
ష్ఠురులై జిహ్వలఁగోసి కొం ద్రదివి ముముక్షుల్ మెత్తురే యిత్తఱిన్!"

(శివయో., ౪ అశ్వా.)

లంబికా శివయోగి యొకవేళ నీయాంతరఖేచరిని తరువాత నెఱిఁగి యాచరించి యుండిన నుండవచ్చును గాని, మొదలితఁడు నాల్కను గోసికొన్న వాఁడే యని యతని పేరే తెల్పుచున్నది. అనఁగా నితనికదే పేరని కాని, అనలా పేరుగల వ్యక్తి యొకఁడుండి వేమన్నకు గురువైనాఁడని కాని కచ్చితముగాఁ జెప్పలేము. మఱి యిటువంటి యోగి యెవనికో యతఁడు శిష్యుఁడైయుండక తప్పదు. కావున వాడుకలో నున్న యతనినే గురువుగా నంగీకరింతము.

ఆ గురువువద్ద శిష్యునికిని ప్రప్రథమమందు పై హఠయోగవిద్యలో నుపదేశము జరిగినది. ఇతఁడును నాలుకను గోసికొన్నాఁడు. ఎపఁడో నావంటివాఁ డిదంతయు వట్టి భ్రాంతియని తిరస్కరించెను గాఁబోలు. వాని నొప్పింపలేక, గురువుగారి యందలి నమ్మకముచేతనో, తన యనుభవముచేతనో దానియందు సందేహములేక యిట్లు ఆక్రోశించినాఁడు:

"ఖేచరీముద్రకు కీలెఱుంగఁగ లేక
వాదులాడునట్టి వారినెల్ల
త్రొక్కి నాల్కఁబట్టి తుదఁ గోయవలయురా!

(ఓ. లై., ౧3-౪-౧౬; మఱియు, పెక్కు వ్రాఁతప్రతులు)

ఇట్లే పంచాక్షరీమంత్రము, ద్వాదశాక్షరీమంత్రము మొదలగు వానిని గూడ నితఁడు కొన్నాళ్ళు జపించినట్లున్నది. "ముక్తికిఁదాఁ దల్లి సుమీ పంచాక్షరి" యని (వే. సి., ౧౨ ౦-) యితఁ డన్నాఁడు. తరువాత ప్రాణాయామసాధనకు మొదలిడి నాఁడు. 'ఊఁగి లాగిలాగి యొనరఁగ బిగఁబట్టి పూని గాలి విడిచి' (౫౫౮) వానిని సాధించినాఁడు. ఆ సందర్భమున నితనికి—

"క. భువి పొందుటుడిగి దూర
శ్రవణంబును దూరగమన జవమును, నమృత
స్రవమును, సుదూరదృష్టియు,
నవిరళ నాదశ్రవణము నగు మోదమునన్"

(శివయో., 3 అశ్వా.)

*చూ. హఠయో. ౩, ఉప. ప. ౩౨ నుండి ౩౦ వరకు.

అని చెప్పిన సిద్ధులలో తక్కిన వెట్లుండినను, నాదశ్రవణము మాత్రము కలిగినది ఆ లయయోగమును దా ననుభవించినాఁడు—

"ఆ. నాదమలరఁ జేసి నాదంబుఁ జొంగించి
భేదమింతలేక పెనఁగినపుడు
పాఱు కాల్వవలెను పాఱురా యానాడు..." (౨౧౮౬).

ఇట్లే షట్చక్రభేదనమగు కుండలీయోగమును గూడ సాధించినాఁడు (3౧౫౨-౫౬). అందులో కడపటి సహస్రారచక్రమును జేరు సాధనలో—

"ఆ. నిటలదుర్గ మెక్కి నిక్కి చూడంగనె
కుటిలరూప కళలఁ గూరుఁ నెఱుక" (౨౨౩౨).

అట్లగుటచేత, ఇంకను పూర్తిగా అద్వైతానుభవములేక మనసు చలాచలముగా నున్నది గావున, ఆత్మ పరమాత్మల స్వరూపము వేఱువేఱుగాఁ దెలియఁగోరియు నది యింకను సాధ్యముగాక—

"ఆ. నిన్నుఁ జూచెనేని తన్ను తా మఱచును
తన్నుఁ జూచెనేని నిన్ను మఱచు;
ఏవిధమున మనుజుఁ డెఱుఁగు నిన్నును దన్ను ?..." (౨౨౪౦).

అని కష్టపడినాఁడు. ఈ సంప్రజ్ఞాత సమాధియందే స్వగుణ స్వరూపము క్రమముగా నట్లు అనుభవమునకు వచ్చునఁట—

"క. శ్రీ వెలయఁగ సాకారము,
నావల దీపాకృతియును, నాశిఖలాగుణ
నీవార శూకరూపము,
భావన పఞ్చవిధము, సగుణభావములైదున్"
(శివయో., ౧ ఆ.).

ఇట్టి తేజోదర్శనము వేమన్నకును గలిగినది—

"ఆ. కనులు రెంటి నడుమ కానంత నిలిపిన
బొమలు మీఱి చూడ్కిఁ బొందఁజేయు,
క్రమమెఱఁగి లోన కాంతిని బట్టరా..." (౯౧3).

కాని యింతటితో నుండక—

"ఆ. కనుల చూపు నిలిపి కాంతిని గమనించి
కాంచవలెను చిత్రకళల దాఁటి..." (౯౧౦).

అనుకొని సాధింపఁగా, భావరూపమైన పైఁజెప్పిన యుపాస్యవస్తువు అభావ స్వరూపముగా మాఱి తుదకు సోహంభావసాధనచే 'భావాభావాతీతం' బైన నిర్గుణము అనుభవమునకు వచ్చినది. అది 'వియత్సదృశంబై'—అనఁగా, ఆకాశమువలె బయలై— యుండునఁట. * ఆ బయలంచే బ్రహ్మమున్నదఁట—

"ఆ. తెలివి నిలిపిచూడు దీపించు నాకళల్,
కళలుడుపకచూడు కలుగు బయలు;
బయలు నంటిచూడు బ్రహ్మంబు గాంచెదు..." (౧౯౬3).

కాని యా బయలే బ్రహ్మ యని వేఱొక్కచోట వేమన చెప్పెను—

*శివయో., ౧ ఆ.

"క. బయలున సర్వముఁ బుట్టును,
బయలందే లీనమగును, బ్రహ్మంబనఁగా
బయలని మదిలోఁ దెలిసిన
బయలందే ముక్తి బట్టబయలగు వేమా" (౨౬౯౬)

మఱియు నాబ్రహ్మము తానేతప్ప వేఱుగాదని తెల్పుకొనెను. "తన్నుఁదా నెఱిఁగినఁవానెపో బ్రహ్మంబు" (౨౮౭౭) కావున 'ఏవిధమున మనుజుఁ డెఱుఁగు నిన్నును దన్ను ?' అని వెనుక వేసినప్రశ్నకిప్పుడు ప్రత్యుత్తరము లభించినది—

"ఆ. నిన్నుఁ జూచుచుండ నిందును తత్త్వంబు,
తన్నుఁ జూచుచుండఁ దగులు మాయ ;
నిన్ను నెఱిఁగినపుడె తన్నుతానెఱుఁగును..." (౨౨౩౯)

తాను బ్రహ్మమైనపుడు తక్కినవన్నియు నేమి తప్పుచేసినవి ? కావున సమస్తమును బ్రహ్మమే. "బ్రహ్మమన్నిటఁ దగుఁ బరిపూర్ణమైయెప్డు" (౨౮౯౬)

ఇట్లు రాజయోగపరమావధియైన యద్వైతానుభవమును సాధించిన వెంటనే, ఆసనములు, ప్రాణాయామము మొదలగు హఠవిద్యల నితఁడు తిరస్కరించెను. ఇది—

"ఆ. ఏఱుదాఁటి మెట్టకేఁగిన పురుషుండు
పుట్టి నరకుఁ గొనక పోయినట్లు..." (౮౬౦)

అని యితఁడే వేఱొక విషయమై చెప్పిన న్యాయమువంటిదే కదా ! చూడుఁడు :

"ఆ. ఆసనములు పన్ని అంగంబు బిగియించి
యొడలు విఱుచుకొనెడు యోగ మెల్ల
జెట్టిసాముకన్న చింతాకు తక్కువ..." (౩౩౮)

"ఆ. కల్లగురుఁడు గట్టు నెల్లకర్మంబులు
మధ్యగురుఁడు గట్టు మంత్రచయము
ఉత్తముండు గట్టు యోగసామ్రాజ్యంబు..." (౯౬౩)

కాని నాకొకటి తోఁచుచున్నది. హఠమార్గము చాలకష్టమైనది. దానిని సాధింపఁగల యోర్పును సామర్థ్యమును గలవారరుదు. అనేకులిందలి సిద్ధుల కానపడి యంతటితో చాలించుకొనుట సత్యము. అట్లుగాక రాజయోగమును సాధించి ఆత్మజ్ఞానమును సంపాదించుటకే దృఢచిత్తముతో హఠమును సాధించుచు కష్టపడువానిని జూచి కరుణించి సమర్థుఁడగు గురువు, స్వశక్తితో నొకనిమిషమందు శిష్యునికి అసంప్రజ్ఞాతసమాధినిగల్గించి బ్రహ్మసాక్షాత్కారముఁ జేయింపఁగలఁడఁట ! "సద్గురునాథ ప్రసాదంబున క్షణమున రాజయోగమున మనసు నాశమౌ తోడనె నాశమౌ గాలియు" (శివ. ౪. అ.) దీనినే తాంత్రికులు "వేధదీక్ష" యందురు. శిష్యుని దేహమందలి షట్చక్రస్థానములనెఱిఁగి, మంత్రబీజాక్షరన్యాసముచేసి, మోకాళ్ళు మొదలు నాభి, హృదయము, కంఠము, దవడవఱకును గురువు 'వేధింప' వలయునఁట. తోడనే శిష్యుఁడు పాపములన్నియు నశించి, బహిరంగ వ్యాపారము లన్నియు నిలిచి క్రిందఁబడునఁట. అతనికప్పుడు దివ్యత్వముగలిగి సర్వము నెఱుఁగఁగలఁడఁట. కాని యట్టి సామర్థ్యముగల గురుశిష్యులిరువురును దొరకుట దుర్లభమఁట !* వేమనకుఁగూడ హఠయోగమువలన వేసరియుండిన వేళలో

---

*చూ. కులార్ణవతంత్రము, ౧౪ వ ఉల్లాసము.

గురువు ఈ వేదదీక్ష నిచ్చెను గాఁబోలు. వివేకానందుఁడు మొదలగు శిష్యులకు రామకృష్ణపరమహంసుఁ డిట్టి దీక్షనే యిచ్చినట్లున్నది. *

"ఆ. గతముచేసినట్టి కర్మబంధములెల్ల
పరిసి పోవు సత్యగురుని వలన
కుమ్మరి కొకయేడు గుదియకు నొకనాఁడు..." (౧౨౪౯)

('గుదియకునొకయేటు' అని వ్రాఁతప్రతులు)

ఇదియే నిజమగునేని ఆసనాదులు నిరర్థకములని యితఁడు తిరస్కరించుట సహజము. కాని యితఁడు తనయనుభవము నితరులకు బోధించినప్పుడు అట్టి గురువు నాశ్రయింపుఁడనిచెప్పలేదు; మీరే సాధింపుఁడన్నాఁడు—

"ఆ. ధాత్రి జనులకెల్లఁ దగ నెఱింగించెద
నొసర హరుని జూచు నుపమయొకటి;
మనసు చెదరనీక మహిమతోఁజూడుఁడీ..." (౨౧౩౭)

"ఆ. తారకంబుఁ జూచు దారివేఱే కద్దు,
సమముగాను జూడఁ జక్కఁబడును;
వెఱ్ఱిగాను జూడ వెలుఁగెల్లఁ బాఱురా..." (౧౯౨౨)

అనఁగా నిది స్వప్రయత్నముచేతనే సాధింపవచ్చునన్నమాట. ఏమో! ఎవ రెఱుఁగుదురు?

"ఆ. రాజయోగి మహిమ రాజయోగికిఁ గాక
యితరజనులకెల్ల నేమి తెలియు...?" (౩౨౯౩)

ఇట్లు అసంప్రజ్ఞాతసమాధిమహిమచే తానే దైవమని యెఱిఁగిన వెంటనే, యదివఱకే యుందుమా పోదుమాయని యూఁగులాడుచుండిన హరిహరులు ఇతని ప్రపంచమునుండి యంతర్ధానమైపోయిరి. "తాను దేవుఁడైన దైవమేకొలుచురా" (౩౨౯౩) యను వానివద్ద నేవేవతలకుప్పు పుట్టును? ఇతఁడు—

"ఆ. బ్రహ్మఁజంపి విష్ణుభాగంబులోఁ గల్పి
విష్ణుఁజంపి శివుని వీఁకఁగలిపి
శివునిజంపి తాను శివయోగి గావలె..." (౨౭౮౩)

అని సంకల్పముచేసి గెలిచినవాఁడు! కావుననే వెనుకఁజెప్పినట్లు,

"ఆ. బ్రహ్మవ్రాఁత కెదురు పల్కినవాఁడును
ఆదివిష్ణుమూర్తి మఱచువాఁడు
మూఁడుకనులవాని మొనసి నిల్చినవాఁడు
కానఁబడరు నీవుకాని వేమ" (ఓ. లై., ౧౨-౧-౩౦)

అని చెప్పుకొని త్రిమూర్తులపై కసిదీర్చుకొనెను. కాని శైవుఁడై పుట్టినందుకు అందఱికిని అగపఱకు శివునకు శిక్షనీయలేదు: అంతే గౌరవముగా పరమేశ్వరుఁడు సంతోషింపవలసియున్నది.

పై రాజయోగసాధనవలన వేమన నిజముగా తత్త్వజ్ఞానమును సంపాదించెనా? అతఁడు బోధించిన యద్వైతమే పరమతత్త్వమా? అను ప్రశ్నలకు బదులుచెప్పుట నాశక్తికి మీఱినపని. బ్రౌనుదొర ఇతని సిద్ధాంతము అర్థము కానిదనియు నిష్ఫల

* See "The Life of Sree Ramakrishna".

మైనదనియుఁ జెప్పెను.* నా కాధైర్యము లేదు. నాకింతమాత్రము నమ్మికగలదు: వేమన్న తాను తత్త్వజ్ఞుఁడైతినని ధృఢముగా నమ్మెననుటలో సందేహములేదు.

ఇట్లు ఇతఁడు ఈ సంసారుల ప్రపంచమునందలి దంభవంచనాదులకు రోసి, అందే మోక్షశ్వేతద్వీపము గలదనుకొని బైరాగుల ప్రపంచమునఁ బ్రవేశించెను. కాని, పాపము, మనుష్యులయోగ్యత యెందున్నను ఒకటే యనుతత్త్వమును అతఁడచ్చట నేర్చుకొనవలసి వచ్చెను. ఎందఱో యోగిపుంగవులు తాము సిద్ధులమని, మాంత్రికులమని, విరక్తులమని, తత్త్వజ్ఞులమని, వేషములు వేసి ప్రపంచమును ప్రతారణ చేయుచుండిరి. 'సర్వోపాయ పరిభ్రష్టా వేశ్యా భవతి తాపసీ'†యనునట్లు ఇంకెందును జీవనము జరుగనివారికీ యోగివేషము కల్పవృక్షమువంటి దాయెను. తక్కిన విద్యల లోగుట్టును ఇతరులు చాలవఱకు నెఱుఁగఁగలరు. కాని ఈ 'యోగుల' కసరత్తులు, బహిరంగోపాసనములు, సమాధులు మొదలగు వానికి మోసపోనివా రపుడు. ఇట్టి వారిప్పటికిని మన సంఘమందు సంచరించి, చదువుకొన్నవారినే లోపఱచికొని, సంసారములు ధ్వంసముచేయుచున్నారనుట మీరెఱుఁగుదురు—

"ఆ. బ్రతుకుదెరువు లేని బడుగులందఱు పెద్ద
యోగివరులమనుచు సాఁగిరాఁగ
బండవాండ్రు ముందు దండంబు లిడుదురు..." (౨౭౮౩)

కడపటికిన్నాళ్ళు భోగమునందును యోగమునందును కష్టపడి యతఁడు నేర్చుకొన్న ముఖ్యవిషయములివి:

సంసారము సారములేనిది. దుఃఖమయము; మాయారూపము; (ఈ 'మాయ' శబ్దమున కితనికి నిజమైన యర్థమేమో తెలిసికొను మార్గములేదు). ఈమాయ సంసారము మనసులోనే పుట్టినది. దీనిని దప్పించుకొనుట ప్రధానపురుషార్థము. దానికి కర్మములు పనికిరావు. ఉపవాసములు, విగ్రహారాధనలు మొదలగువానిచే ఆ మాయ తెగదు. కాఁబట్టి 'కర్మగుణములెల్ల కడఁబెట్టి నడవమి, తత్త్వమెట్లు తన్నుదగులుకొనును?' (౯౪౪) అని యితని ప్రశ్న. ఆ తత్త్వము నెఱుఁగుటకు మమతలు విడిచి మనస్సునిలిపి ధ్యానించుట చాలును. తక్కిన సాధనములక్కర లేదు. దీనికై యడవులకు కొండలకు పోఁబనిలేదు. పల్లెలలో ఇండ్లలోనుండియే చేయవచ్చును. కాని పట్టణములందుండకపోవుట మేలు. ఎందుకన్నఁగా:

"ఆ. పట్టణంబులందు పతులకు సతులకు
మోహమెచ్చు దానియూహలెచ్చు
ముక్తిమార్గమునకు యుక్తియే తెలియదు..." (౨౩౭౪)

కనుక ఆ మోహమును వదలించు బ్రహ్మచర్యము ముఖ్యముగా సాధింపవలయును. కామాతురత్వము నిలుపుటకు అందలిరోఁత, దానివలని దుష్ఫలములును ఎఱిఁగి క్రమముగా స్వాధీనపఱచుకొనవలసినదే కాని, కృత్రిమములగు హఠవిద్యలచేతఁగాదు. 'పేని గడ్డిగట్ట నేనుఁగు నిలుచునా?' (౯౪౩) యని యితఁడడుగుచున్నాఁడు. ఇది స్వాధీనమైనచో తక్కిన సాంసారికదుఃఖ హేతువులైన క్రోధలోభాదులు వెంటనే నశించును. పంచేంద్రియములు పంచభూతములందు సంచరించుచున్నన్ని నాళ్ళును ఈ జగత్తు ఉన్నట్లు కానవచ్చును (౨౩౩౫). కావున

---

*See Brown's Vemana, Preface, p. II.

†అన్నియుపాయములును పనికిరాకపోయిన వేశ్య తాపసియగును అని తాత్పర్యము.

నా యింద్రియముల నంతర్ముఖముగాఁజేసి మనస్సులోఁ గలిపి చూచిన, ఇన్నిటికిని కారణమయిన జీవుఁడొక్కఁడే నిత్యమనియు తక్కినవన్నియు అనిత్యమనియుఁ దెలియును. ఆ జ్ఞానము గలిగిన తరువాత కన్నులు విచ్చి చూచినను ఆ జీవుఁ డొక్కఁడే ఈ ప్రపంచమందలి చరాచర వస్తువులందెల్ల నంతర్యామిగా నున్నాఁడని తెలియును. అతఁడు లేనిదేదియు నిలువదు. కావున నదియే బ్రహ్మము. అనఁగా. తానే బ్రహ్మము. కావున నీ బహిఃప్రపంచమందొకరి యెక్కువయు నింకొక్కరి తక్కువయు లేదు. జాత్యాది భేదమున కర్థములేదు. వ్యావహారికమైన గౌరవమునకు కారణ మీజ్ఞానము. ఇది లేని వారందఱు నొక్కటే. కావుననే మైల, యెంగిలి మొదలగునవి యెల్ల వట్టి భ్రాంతులు.

ఎప్పుడీ విషయములు ఇతని మనస్సుకు తట్టెనో, వాని నప్పుడే తానాచరించి, మీరును అట్లుచేయుఁడని యితరులకు బోధింప మొదలు పెట్టెను. ఇదివఱకును నే నుదాహరించిన పద్యములవలన వేమన యందలి సృష్టిసిద్ధమైన స్వభావ మొకటి మీకు స్పష్టమై యుండును. అదేదనఁగా, ఉద్రేకము. ఇతఁడు చేడిన చేట్లకును, పడినపాట్లకును, సాధించిన సాధనలకును, అదేమూలము. మనసులోఁ దోఁచినది నోటఁజెప్పుటకును చేతఁజేయుటకును భేదమట్లుండఁగా, అసలంతరమే యుండదు. యమ నియమాది యోగసాధనలచే ఇతని కన్నియు సిద్ధించి యుండును గాని, శాంతి మాత్ర మెక్కువ సిద్ధింప లేదని చెప్పవలసియున్నది. తన కిష్టము కాని పనులు చేయు వారిని, తన మాటలను విననివారిని జూచి, వారి యజ్ఞానమున 'కయ్యోపాప' మనుటకు బదులు ఇతని కసహ్యము జనించును. ఆ యసహ్యము మనసులో నుండక నోటినుండియు నసహ్యముగానే పలుమాఱు వెడలును! అట్టి సందర్భములలో తా న్నాడు మాటలలో యుక్తియున్నదా,లేదా,యనికూడ విచారింపఁడు. చూడుఁడు—

ఎప్పుడును యోగానందమందుండ నేర్చినవారికి బహిరంగములగు వేషము మొదలగువానిపై నంత యక్కఱయుండదు. వస్త్రములు శుభ్రముగా నుంచుకొనుట, అందుకై చాకలివారితో కలహించుట మొదలగు పనులకు కాలమును ఉండదు. కావున నట్టివారు చినిఁగిన మురికిబట్టలతోనే కాలముఁ గడపవచ్చును. కొందఱదియు వలదని 'కౌపీనవంతః ఖలు భాగ్యవంతః' అని యనుకొని యట్లుందురు. వేమన గూడ తొలుత కొన్నాళ్ళు 'గోచిపాతకంటె కొంచెము మఱిలేదు' (౪౫౦) అని యనుకొన్నను, తరువాత ఇంకను దూరముపోయి సాక్షాత్పరమశివ సారూప్యమును బొందినాఁడు. ఇట్టి సందర్భమున ఇతని నెవరో 'కోత్యాటలాడించి వెళ్ళియనుచు నూరు వెడలఁగొట్టిరి' (౧౩౩౯). అప్పుడు దానికతఁడిచ్చిన అసహ్య ప్రత్యుత్తర మట్లుండనిండు. ఈ తర్క యుక్తి వినుఁడు—

"ఆ. తల్లిగర్భమందు తాఁ బుట్టినప్పుడు
మొదలు బట్టలేదు తుదనులేదు,
నడుమ బట్టఁగట్ట నగుఁబాటుగాదొకో..." (౧౮౪౫)

కాని, యీ యోగవిద్య, ఈ కవిత్వము—తల్లిగర్భమునఁ బుట్టినపుడే వేమన్నకు వచ్చినవా? ఏమియుక్తి! కాని యీ వైరాగ్యము ముదురుటకు ముందు వేమన ఈ బహిరంగ శుద్ధిగూడ మంచిదనియే తలఁచెను—

"ఆ. మాసిన తలతోడ, మలినవస్త్రముతోడ,
ఒడలి జిడ్డుతోడ నుండెనేని,
అగ్రజన్ముడైన నట్టె పొమ్మందురు..." (౩౦౮౧)

ఇట్లే యెంగిలిని గూర్చిన యితని వాదమును విచిత్రమైనది. సామాన్యముగ నోటిలోనిజొల్లు ఆహారాదుల దోషముచేతను, రోగక్రిములచేతను దుష్టముగా నుండును గావున, మనుష్యునిదేహమందు వెడలు మలములలో నదియు నొకటిగా భావించి, దాని సంపర్కముచే ఇతరులకు రోగముల సంక్రమణములును, అసహ్యమును కలుగకుండ వలెనని, యెంగిలి చేయరాదని, యెంగిలి యన్నము తినరాదని, మనుష్యులు నియమము లేర్పఱుచుకొన్నారు. ఎంగిలి యన్నము నితరులకు పెట్టరాదని వేమనయు నొకమాఱు తలఁచినవాఁడే (౬౩౯). కాని దానినతిచేసి వీధులలో నడుచునప్పుడును ఎంగిలి మంగలములు త్రొక్కుదుమేమో యని పేడనీళ్ళు చల్లుకొని యడుగులు పెట్టువారును, ఎంగిలి పాత్రములు దర్భవేసి కాల్చువఱకును పనికిరావనువారును మనలో నున్నారు. ఇది యసహ్యమని యందఱంగీకరింపవలసినదే; కాని విరక్తుఁడైన తరువాత వేమన్న యేమన్నాఁడో వినుఁడు—

"ఆ. ఎంగిలెంగిలనుచు నినోటితోడనే
వేదములను జదువు వెఱ్ఱులార!
ఎంచిచూడ నదియు నెంగిలి గాదొకో..." (౫౯౬)

వారి దొకమూలయైన నితని దింకొకమూల! వేదము శబ్దమే! అదియు ఎంగిలి యన్నమాట కర్థమేమి? శబ్దమునకుఁగూడ సాంక్రామిక రోగములు వ్యాపించునా? అను నీ మాత్రపు ప్రశ్నలు వేమన్నకు తోఁపలేవని కాదు. తోఁచినను ఆ యుద్రేకపు టుడుకులో గమనింపలేఁడంతే.

ఇట్లే ఏకాదశి మొదలగు దినములలో నుపవాసముండిన పాపములు నశించి పుణ్యము గలుగును; తపస్సుచేసిన నష్టైశ్వర్యములు లభించును; తిరుపతికో, శ్రీశైలమునకోపోయి, యందలి దేవునకు సేవచేసిన మోక్షము నిచ్చును—అని సామాన్యముగ నందఱును నమ్ముదురు. నెలలకొలఁది యుపవాసములుండి లేని రోగములు తెచ్చుకొన్నవారున్నారు. తపస్సు చేయఁబోయి నష్టైశ్వర్యులైనవారు గలరు. దేవళములలో మూలవిగ్రహములకేకాక, యందలి కంబాలకు దూలాలకును మ్రొక్కువారును లేకపోలేదు. కావున ఈ యుపవాసము, తపస్సు, విగ్రహపూజ మొదలగువాని యందలి దోషములను గమనించి ఖండించువారున్నారే కాని యివి శుద్ధముగా నిష్ఫలములని యేతెలివిగలవాఁడును ఇదివఱకుఁ జెప్పలేదు. కాని ఈ పాపకార్యములకు వేమన్న ధర్మసూత్రములలో శిక్ష యేమనుకొన్నారు?

"ఆ. ఒక్కప్రొద్దులున్న నూరిపందై పుట్టు,
పృథివిఁదపముసేయఁ బేదయగును;
నిగిడి శిలకు మ్రొక్క నిర్జీవులౌదురు..." (౭౯౪)

ఇవన్నిటికన్న పైయుద్రేకము ఒక్కవిషయమందు వేమన్నను చాలచెఱిచినది; అదేదనఁగా, సృష్టియందలి స్త్రీవ్యక్తి. మొదటినుండియు మనుష్యజాతిలో మగవాఁడు తన నులోచనములతోనే చూచి ప్రపంచస్వరూపమును నిశ్చయించెను. సహజముగా గర్భధారణము, ప్రసవము మొదలగు ప్రకృతి సిద్ధములైన భారములు, మోయవలసి యుండుటచే తనకన్న దుర్బలురాలైన యాఁడుది తనకు తప్పక కావలసిన వస్తు వగుటచే, తనచేతిక్రింద నుండవలయుననియు, తను చెప్పినట్లు వినవలెననియు పురుషుఁడు నిష్ణయించెను. అది తనకెంత యావశ్యకమో తాను దాని కంతేగదా

యని యాలోచింపవలసిన యక్కర యతనికి తోఁపలేదు. స్వార్థము ప్రకృతి స్వభావ ధర్మము. దాని కితరులు విఘ్నము గల్గించుపఱకును ఇతరుల కష్టసుఖముల నెవ్వరును సామాన్యముగ గమనింపరు. కావున స్త్రీ, పురుషుని యిల్లు, వాకిలి మొదలగు వానివలె ఆస్తిలో చేరిపోయెను. వానిని సంరక్షించుట, కాచుకొనుట, తనకు పనికిరాకున్న పడఁగొట్టుట మొదలగు నధికారములు మగవానికి వచ్చి యతఁడు 'భర్త' యాయెను. తక్కినవానివలె నాఁడుదియు 'భార్య' యాయెను. కాని యిల్లు వాకిండ్లకు లేని తెలివి, స్త్రీలకు, పురుషులకువలెనే, కలదు గావున, స్వాతంత్ర్యకాంక్ష వారివలె వీరికిని గలిగెను. దేహబలమే యుండియుండిన, వీరేశ లింగము పంతులుగారి 'అఁడుమళయాళము' ఎన్నఁడో నిజమైయుండును. అది లేకపోవుటచే ఇతరవిధముల మగవారిని వశపఱచుకొని వారిపై దొరతనము చేసి కసి దీర్చుకొనవలెనను ప్రయత్నము జరిగినది. స్త్రీపురుష లొకరిని జూచి యొకరు మోహించి లోపడుట సమానమైనను, స్వాతంత్ర్యము గలవాఁడగుటచేత మగవానికి తన మనసును నిల్పుకొను శక్తిపోయినది; స్త్రీకి పారతంత్ర్యముచేత నది హెచ్చినది. కావుననే యేయే మార్గములచేత పురుషుని ముగ్ధునిగాఁ జేయవచ్చునో యవన్నియు స్త్రీ నేర్చుకొనవలసి వచ్చెను. తుది మొదలులేని యలంకారములు, వేషములు, మఱుఁగులు, మౌనములు స్త్రీధర్మములైనవి. నేఁటికిని స్త్రీమనసు నీడ్చుటకు పురుషుఁ డెన్ని విద్యలు నేర్చినాఁడో, యన్నిటికన్న నెక్కువ పురుషుని మనసు నీడ్చుటకు స్త్రీలు నేర్చినారనుట సహ్యము గాకపోయినను సత్యమైన విషయము. మగనిపైని స్వాతంత్ర్యమును సంపాదించిన యావిద్యలు క్రమముగా మగజాతిపై ప్రయోగింపఁబడినవి. కావుననే పురుషుని చెఱచుటకే స్త్రీ పుట్టినదను దుర్భావ మొకటి మగవారిలో ప్రబలించెను. మనువు ఇట్లు చెప్పినాఁడు—

"స్వభావ ఏషనారీణాం నరాణామిహదూషణమ్.
అవిద్వాంసమలం లోకే విద్వాంసమపివా పునః
ప్రమదాహ్యుత్పథం నేతుం కామక్రోధవశానుగమ్" (మను., ౨ అధ్యా.)

(మగవారిని జెఱచుట స్త్రీల స్వభావము, చదివినవానినిగాని, చదువని వానిని గాని కామక్రోధవశుఁడైన వానిని తప్పుదారి కీడ్చుశక్తి స్త్రీకి కలదు.)

కావున మగవాఁడెట్లూరకుండఁగలఁడు? తాను జేసిన తప్పెఱుఁగక, వారి నణఁచుట తన స్వభావముగాఁ జేసికొని, అందుకుఁ గావలసిన బంధుకట్లు, సంకిళ్లు, తలుపులు, తాళములు, ఎన్నియో కనిపెట్టినాఁడు. ఇల్లే చెఱసాలగా మార్చు కొన్నాఁడు. ఎప్పుడును వారిపై 'నిగా' యుండుటయే యతని ధర్మమైనది.

కాని హిందూ సంఘమందలి స్త్రీలెల్ల నిట్లే యుండిరనియు, మగవారెల్ల వారిని గూర్చి యిట్టి భావములే కలిగియుండిరనియు చెప్పలేము. పరస్పర విరుద్ధములైన విషయములకు హిందూ సంఘమందున్నంత విశాలావకాశము మఱెక్కడను లేదు గాఁబోలు. అదే మనుస్మృతిలో వేఱొకచోట—

"యత్ర నార్యస్తు పూజ్యన్తే రమన్తే తత్రదేవతాః
యత్రైతాస్తు నపూజ్యన్తే సర్వాస్తత్రాఫలాః క్రియాః" (మను., 3-౫౬)

(స్త్రీల నేచోట పూజింతురో యాచోట దేవతలు సంతోషింతురు. వారు పూజింపఁబడని స్థలములో నెన్ని సత్కర్మములు చేసినను నిష్ఫలములగును.)

అని చెప్పఁబడినది! ఇదిగాక స్త్రీ వ్యక్తి సృష్టిచేయు బ్రహ్మయొక్క శక్తి యని నిశ్చయించిన తాంత్రికులు, జగన్మాతృరూపిణియగు శక్తి నుపాస్య దేవతగాఁ

జేసికొన్న తరువాత, స్త్రీ విషయమందిట్టి యపచారములు తప్పని గమనించినారు—

"శతాపరాధైర్వనితాం పుష్పేణాపి నతాడయేత్
దోషాన్న గణయేత్ స్త్రీణాం గుణానేవ ప్రకాశయేత్"
(కులార్ణవతంత్రము, ౧౧ ఉల్లాసము)

(నూరుతప్పులు చేసినను స్త్రీని పూవుతోనైనను గొట్టరాదు. వారి దోషములు బైలు పెట్టరాదు. గుణములనే వెల్లడిచేయవలెను.)

వైష్ణవులింకను దూరముపోయిరి. స్త్రీయందు పాపమను పదార్థమే యుండ దనిరి!

"వనితాయాం తథాశక్ర దురితం నైవవిద్యతే" (లక్ష్మీతంత్రము, ४3 అధ్యా.)

ఇది మఱొక ధ్రువముగదా. ఐనను సామాన్యముగ స్త్రీ భోగ్యవస్తువనియు, మగవానిని జెఱుచుటకే సృజింపఁబడినదనియు రూఢమూలమైయున్న భావము మనలో నింకను నశింపలేదు.

వేమన యిట్టిసంఘమందు పెరిగినవాఁడు. స్త్రీలచే చాలకష్టము లనుభవించిన వాఁడు. తాను సాధించు మనోనిగ్రహమునకు వారు పలుమాఱు విఘ్నములుగా దాఁపురించి యుండవచ్చును. కావున నట్టియవస్థలో తన దౌర్బల్యమును నిందించి కొనక, స్త్రీజాతినే బూతులు దిట్టినాఁడు—

"గతులు నతులవలనఁ గానంగలేరయా" (3౮3౨)
"ఆఁడు దనఁగ రోత—..." (౨3౧)

ఇత్యాదులనేకములు. మఱియు, ప్రభువు, ప్రజలు వీరినిగూర్చిన—

"ఆ. ప్రజయొనర్చు చెడుగు ప్రభువునకు వచ్చును,
ప్రభువు మంచియందు ప్రజకు సగము,
ప్రభువొనర్చుచెడుగు ప్రజలకు రాదురా..." (౨౬౨౨)

ఈ న్యాయమే భార్యాభర్తల విషయమందును వర్తించునని ధర్మశాస్త్రములు చెప్పుచున్నవి. కాని వేమన్నకివి న్యాయమని తోఁపలేదు.

"ఆ. సతియొనర్చు చెడుగు పతికవశ్యమువచ్చు;
పతియొనర్చు మంచి సతికి సగము;
పతియొనర్చు చెడుగు సతికేల రాదొకో?..." (3౮౨౬)

ఒకటే విధమైన రెండుసందర్భములలో నొకటి నిస్సందేహముగా నంగీకరించి, రెండవదానిని మాత్ర మన్యాయమని తలఁచుటకు అసహ్యమా అజ్ఞానమా కారణము? ఈ పద్యములన్నియు అతఁడు బ్రహ్మజ్ఞానము సంపాదింపక మున్ను వ్రాసినవనుకొని తృప్తిపడుదమనుటకు వీలులేదు. దానిని సంపాదించిన తరువాత నేమైన తన యభి ప్రాయమును మార్చుకొని ఆడువారిని గూర్చి 'అయ్యో పాప' మనెనా? వారి నడతను దిద్ది తత్త్వజ్ఞానము నుపదేశించెనా? దేశదేశములుఁ దిరిగి యింపఱి కిన్ని బోధనలు చేసినవాఁడు, ప్రపంచమంతయు మగవారిమయమనియే తలఁచినట్లు కానవచ్చుచున్నదే కాని, 'ఆఁడువారున్నారే, వారు చదువుసంధ్యలు లేక మగవారి కన్న సన్యాయమై పోవుచున్నారే' యని యెవరినైనా దగ్గఱకుఁ బిలిచి శిష్యు రాండ్రనుఁగాఁ జేసుకొనెనా? ఇతని పద్యములన్ని వెదకినను అట్టి మనఃపరిణామ మున్నట్లే కానరాదు. ఒకవేళ వారిసహవాసముచే మరల తాను బతితుఁడైపోవునేమో యని భయపడెననుకొందమా? త్రిమూర్తుల కెదురు నిల్చితినని చెప్పుకొన్నవానికి స్త్రీవ్యక్తి యంతకన్న బలవంతమయ్యెనా? అట్లేని యతని రాజయోగసిద్ధి విలువ

యేమి? ఆ 'ఋతంభర' యను ప్రజ్ఞ మహత్త్వమంతయు వట్టిమాటలేనా? తరిగొండ వెంకమ్మవంటి యోగినిని మనకు ప్రసాదించిన 'సుబ్రహ్మణ్యయోగి' యీవిషయమున నితనికంటె ప్రపంచమున కెక్కువ యుపకరించినాఁడని తలఁచినఁ దప్పేమి? అది యట్లుండనిండు.

వేమన్న యిట్లు వీరశైవమతమందుఁ బుట్టి, సంసార సుఖదుఃఖములన్నియు ననుభవించి, రసవాద సంబంధమున శివయోగుల సహవాసమునఁబడి విరక్తుఁడై హఠ యోగమును సాధించి, యాపిమ్మట రాజయోగియై, హరిహరాది సగుణోపాసన మీఱి, బ్రహ్మసాయుజ్యరూపమగు అద్వైతానంద మనుభవించి జీవన్ముక్తుఁడైనాడని మన మూహించితిమి.

ఈ సందర్భమున వేమన మతమును గూర్చిన వేఱొక్క సిద్ధాంతమును కొంత చర్చింపవలసి యున్నది. వేమన్న తాంత్రికుఁడని కొందఱందురు.* అగుననియు చెప్పవచ్చును; కాఁడనియుఁ జెప్పవచ్చును. తాంత్రికశబ్దమునకు చాలవిశాలమైన యర్థము గలదు. తంత్రమనఁగా పరబ్రహ్మసాక్షాత్కారమును సంపాదించుటకు పనికి వచ్చు సాధన. మంత్రములు, బీజాక్షరములు, యంత్రములు, ముద్రలు, పూజలు మొదలగు బహిరంగములు, షట్చక్రభేదము, కుండలియోగము మొదలగు నంతరంగములును, తంత్రమని పేర్కొనఁబడుచున్నవి. దీని నాశ్రయించినవారు తాంత్రికులు. అనఁగా హిందూదేశమందన్ని మతముల వారును తాంత్రికులే. వారివారి మతసిద్ధాంతములను సత్యాపనముచేసి యనుభవింపగోరు వారందరును తంత్రమార్గమునే యవలంబించిరి. కాని కొందఱు ఆ మార్గమందు మద్యమాంసాది పంచమకారములకు ప్రాముఖ్యము నిచ్చి యందుచే తమ పూజాదిసాధనలు బహిరంగముగా జరుపుకొనలేక రహస్యముగా నుంచుకొనుటవలన, తక్కినవారికన్న భిన్నులై 'తాంత్రికు' లనఁబడుచున్నారు. స్మృతి ప్రమాణము నంగీకరించిన వారందఱును స్మార్తులైనను శాంకరాద్వైత బ్రాహ్మణులు మాత్రమాపేరున పిలువఁబడినట్లే, వీరికిని వ్యవహారముచే నా పేరువచ్చినది. ఈ తాంత్రికులును అద్వైతులే, కాని వీరు శివతత్త్వమును పూజించుటకుముందు శక్తిని పూజింతురు కావున 'శాక్తేయు' లనఁబడిరి. ఉత్తరదేశమందు వీరిగుంపు బలము. మద్యమాంసాది సేవనచేతను, శ్మశానపూజాదుల చేతను వీరిని వామాచారులనియు నందురు. వానిని వర్జించిన దక్షిణదేశమువారు దక్షిణాచారులనఁబడిరి. వేమన వామాచారుల గుంపుతో సంబంధమే లేనివాఁడు. వారి యాచారము లొకటియు గిట్టవు. వామాచారము లట్లుండనిండు. జాతిభేదము వారికిఁగలదు. చక్రపూజాసమయములందు మాత్రము జాతిభేదమును గమనింపఁగూడదు కాని దానికిబైట మనకు నాలుగుజాతులైన వారి కైదు జాతులు (మహానిర్వాణతంత్రము, ఉల్లా. ౮, ప. ౫) వేఱువేఱు జాతులకు వేఱువేఱు సంస్కారములు (అవే. ౧౩). బ్రాహ్మణాదులు ముగ్గురికిని ఉపవీతములు కలవు. (అవే. ౯—౫) తమకన్న తక్కువజాతివారి యన్నము తిన్నవారికి ప్రాయశ్చిత్తము గలదు (అవే. ౧౧—౧—౨౯). కాశి మొదలగు తీర్థక్షేత్రములు పావనములని వారి నమ్మిక (యోగినీతంత్రము, ౧౬ పటలము). బ్రాహ్మణులకు మర్యాద చేయవలయును (అవే. ౧౩) విగ్రహపూజ యున్నది. ప్రతిమలశిలలను

---

* ఈ మతము శ్రీవేమూరు విశ్వనాథశర్మ గారిది. దీని విషయమై వివరించుచు వారు దయయుంచి నాకొక దీర్ఘలేఖ వ్రాసిరి.

కొన్నవారికి నరకము వచ్చునని వారందురు (కులార్ణవ తంత్రము. ౧౨ ఉల్లా.). ముఖ్యమైన యుపాస్యమూర్తి స్త్రీరూపము గావున స్త్రీలయెడ వారికి మర్యాద యెక్కువ. ఇవన్నియు వేమన్నకు గిట్టవని వేఱుగా చెప్పఁబనిలేదు.

ఇఁక దాక్షిణాత్యులగు తాంత్రికుల గుంపులో చేరినవాఁడన్నను ఇదే కష్టము వచ్చును. దాక్షిణాత్యులలో మాత్రము తాంత్రికులు కానివారెవరు? వైష్ణవులు, శైవులు, శంకరాద్వైతులు—అందఱును తాంత్రికులే. వారితంత్రములలో మంత్రములు, బీజములు మొదలగువాని స్వరూపములందు భేదమున్నదిగాని, సామాన్యతంత్ర స్వభావమునందు భేదములేదు. కుండలినీయోగము మొదలగు హఠసాధనలన్నియు వారును అంగీకరించినవారే. పై వామాచారు లందుఁగల భేద జాతులన్నియు మనలోను గలవు. ఇవిలేక, శక్తిపూజచేయక, వామాచారమును వదలిన తాంత్రికులు మనదేశమందున్నారా? నే నెఱుఁగను.

ఇఁక వామాచారతాంత్రికులకు ప్రమాణగ్రంథములగు 'కులార్ణవ తంత్రము' 'మహానిర్వాణ తంత్రము' మొదలగు గ్రంథములందలి తత్త్వములకును వేమన తత్త్వములకును సామ్యమున్నది. కారణము స్పష్టమే. ఇరువురి మతమును అద్వైతమే. కొన్ని సమానములైన సిద్ధాంతము లనేక భిన్న మతగ్రంథములందుఁ గానవచ్చును. ఒకటి యుదాహరింతును. 'కులాచారమును' రహస్యముగా నుంచ వలయునను సందర్భమున కులార్ణవతంత్రమున ఈ క్రింది పద్యము గలదు :

"వేదశాస్త్రపురాణాని సామాన్యగణికా ఇవ
ఇయంతు శాంభవీ విద్యాగుప్తా కులవధూరివ" (౧౧ ఉల్లాస.)

ఇదే పద్యము 'హఠయోగ ప్రదీపిక' యందు 'విద్యా' యనుటకు బదులుగా, 'ముద్రా' యనుమార్పుతో, 'శాంభవీముద్ర'ను గూర్చి కలదు (హఠ. ఉప ౧ ప. ౨౫). మఱియు, శివయోగసారమునందు ఇదే శ్లోకమే యిట్లాంధ్రీకరింపఁబడినది :

"తే. వేదశాస్త్రములును బహువిధపురాణ
ములును సామాన్యగణికల పోలెనుండు ;
శాంకరీ విద్యయొకటి యాజగతిలోన
గుప్తయై కుల స్త్రీవోలెఁ గొమరుమిగులు" (శివ., ౪. ఆ.)

ఈ కారణముచేత పైరెండు గ్రంథములు వ్రాసినారు కౌలతాంత్రికులన వీలులేదుగదా! ఇదే పద్యమునే వేమన్నయు తెనిఁగించెను. కాని భావమును మార్చెను—

"ఆ. వేద విద్యలెల్ల వేశ్యల వంటివి
భ్రమలఁ బెట్టి లేట పడఁగ నీవు
గుప్తవిద్య యొకటె కుల కాంత వంటిదె......" (3౬3౧)

అందఱికిని దొరకునది కావున వేశ్యలవంటివని వారు చెప్పఁగా ఇతఁడు 'భ్రమలఁబెట్టి తేఁటపడఁగనీవు' కాబట్టి వేశ్యలవంటి వన్నాఁడు. కుల కాంతవలె గోపనీయమని వారు చెప్పఁగా నితఁడు గుప్తవిద్య కుల కాంతవలె మనకు సులభ ముగా ననుకూలించుననుచున్నాఁడు! ఇట్లే—

"పుట్టమీఁదఁగొట్ట భుజంగము చచ్చునా?"
"ఓటికుండ నీర మొప్పుగ నిలుచునా?"
"ఏటి వంకఁదీర్ప నెవ్వరి తరమయా?"

ఇత్యాద్యుపమానములు కులార్ణవము మొదలగు తంత్రములందుఁ గలవు.

వేమన వీనిని వానినుండియే గ్రహించి యుండవచ్చును. హఠయోగమును వామాచార తాంత్రికులు తక్కిన వారికంటె నెక్కువ యుపయోగించుకొన్నవారు కావున వారి గ్రంథములు కొన్ని యితఁడు చూచియుండిన నుండవచ్చును. అంతే కాని యితఁడే తంత్రమార్గమునుగాని నేరుగా నవలంబించి యుండెనని నేను నమ్మఁ జాలకున్నాను. ఇతని సిద్ధాంత మద్వైతము; సాధనకు హఠయోగమూలమగు రాజయోగము. హఠసాధనవేళలో కొన్ని తాంత్రిక మార్గముల నాశ్రయించిన నుండవచ్చును. అందును 'వజ్రోళి' మొదలగు అసహ్యసాధన లితఁడు చేసి నాఁడని నేనమ్మను.

ఇట్లు జీవన్ముక్తిమార్గమును తానెఱిఁగి యది ప్రజలకు బోధించుటకై యితఁ డనేకదేశములు తిరిగినట్లు తోఁచెడిని. కాని యేయేచోట్ల సంచరించెనో స్పష్టముగాఁ జెప్పలేను. తంజాపూరిరాజు లా కాలములో వేమన్నను తమవద్ద నుంచుకొని బంగారు చేయు విద్య నేర్వవలయు ననునాశతో పూజించుచున్నట్లు వాడుక కల దని శ్రీ వంగూరి సుబ్బారావుగారు వ్రాసిరి. (వం.సు. వేమన, పు. ౧౯౮). ఇప్పటి కిని అక్కడ వేమన్న పటము కలదను విషయము మొదలే విన్నవించితిఁగదా. ఇట్లు పోయినచోట నెల్ల మత విషయములు, సాంఘిక దురాచారములు, సామాన్య నీతులు ఇత్యాది విషయములనుగూర్చి పద్యములుచెప్పి బోధించుచు, ఎక్కడ నేది దొరికిన నది భుజించి యవకాశము దొరికినప్పుడెల్ల పరమాత్మ చింతచేయుచు, ఇల్లు, వాకిలి, సంసారము అన్నియు వదలి, తిరుగుచు కాలక్షేపముఁ జేసినవాఁడు—

"క. పరమాత్ముని చింతనలోఁ
దఱచుగ నుండుటయె తగును ధర నాఁకటికిన్
దిరిపెము నెత్తి భుజించుచు
దొరవలె గృహవేదికందుఁ దొంగుము వేమా" (౨౪౪౫)

ఇతని బోధనల నెందరో వినక తిరస్కరించిరనుటలో నాశ్చర్యము లేదు. అసలతని మతసిద్ధాంతములు చదువుకొన్నవారికే యర్థము గానివి. వానియం దేమేని సత్యముగలదేని యది యితనివలెనే కష్టపడి దేహమును మనస్సును దండించిన వానికి తప్ప ఇతరుల కనుభవమునకు రాదు. కంటికి కానవచ్చె నదంతయు మాయ యనియు సత్యము వేఱే కలదనియుఁ జెప్పిన నెందఱికి నమ్మిక కలుగును? దేవుఁడనఁగా అందఱి కంటె గొప్పవాఁడని, సర్వశక్తిగల వాఁడని, కోరిన దిచ్చువాఁడని, నమ్మినవారికి—తమకు సర్వ విషములందునుగల యశక్తి నెఱిఁగిన వారికి—నేనే దేవుఁడను భావము ఎట్లుగలుగును? మఱియు నితని యందలి గొప్ప కష్టము మత సంబంధములగు బహిరంగములైన రూపములును క్రియలును పూర్తిగా ఖండించుట. వానిని వదలుట మనుష్య స్వభావమునకే విరుద్ధము. ఉద్దేశమెంత మంచిదైనను, గొప్పదైనను దానికి తగిన బహిరంగ స్వరూపము లేనిది మనుష్యులలో మర్యాద గలుగదు. దేవుఁడు లేఁడని యూరకయైన నుండ గలరే కాని ఉన్నాఁడని నమ్మినప్పుడు తమ బహిరింద్రియములకు తృప్తిగా పూజోత్స వాదులు సడుపకుండుట యెవరికిని సాధ్యముగాదు. ఆధ్యాత్మిక ప్రపంచమున వీనికి వెలయున్నను లేకున్నను ఆధిభౌతిక ప్రపంచమున ఇవి లేనిది బ్రదుకుట కష్టము ఇది గాక, ఈ బహిరంగములందే మనుష్యునికి సహజమైన కళా ప్రియత్వమునకు తృప్తి కలుగును. కావుననే వేషములను కర్మములను నిందించిన వారెవ్వరుగాని సఫల మనోరథులు గాలేదు. అట్లుండ, అవన్నియు వదలి ముక్కుమీఁద దృష్టి

నిలిపి కూర్చుండుఁ డని వేమన యెంత తిట్టి చెప్పినను అతనినోరు నొచ్చుట తప్ప వేఱు ఫలమెట్లు కలుగును? ఇఁక నితని నంఘ సంస్కారపు నీతులంటిమా, అవి నిండిన చెఱువుకట్ట నొకటే మాఱు త్రెంపఁజూచినట్లు, ఇదివఱ కున్న సాంఘిక వర్తనముల కన్నిటికిని మూలచ్ఛేదము చేయఁ బ్రయత్నించు చున్నవి. ఉన్న దున్నట్లుగా ఒక యూరికిఁ బోయి—

"ఆ. ఉర్వివారికెల్ల నొక్క కంచముఁ బెట్టి
పొత్తు గుడిపి కులము పొలియఁజేసి
తలనుజేయి పెట్టి తగనమ్మఁ జెప్పరా..." (౫౪౫)

యని యెంత పెద్ద గొంతుకతో నఱచినను, జనసామాన్యమున కట్లు చేయుట సాధ్యమా? నంఘ సంస్కారికుండవలసిన ప్రధానగుణము ఏ సంఘమును తాను సంస్కరింపఁ దలఁచునో, దానిలోనే తానును జేరి, వారి సుఖదుఃఖములను తాను ననుభవించి, వారి జ్ఞానాజ్ఞానములతో సహానుభూతి గలిగియుండుట. అప్పుడు జనులు క్రమముగా అతని నర్థము చేసికొందురు; అతని మనసుతో నేకీభవింతురు; అతని శ్రద్ధకు లోనగుదురు. అట్లుగాక బైటనుండి యెన్ని యుపన్యాసము లిచ్చినను లాభము లేదు. వేమన్న తా నన్నివిధముల ప్రపంచవ్యవహారమునకు విరోధముగానే నడుచుచున్నాఁడు. కావున నితని సిద్ధాంతము లనేకుల కంటలేదు. సహజముగా నుద్రిక్త స్వభావము గలవాఁడు గావున, ఇతరుల తప్పులను గని యసహ్యపడఁ గలఁడే కాని వారియందలి గుణములను గమనింపలేఁడు. గుణమే లేని పదార్థ మేదియు భూలోకమందు లేదు. మఱియు నిదానముగా జనులను దగ్గఱకు పిలిచి పదిమాఱులు వారికిఁ జెప్పి బోధించు నోర్పుగాని పాండిత్యముగాని కలవాఁడు కాఁడు. తన మాటలను తిరస్కరించిన వారిని గూర్చి యితఁ డేమనుచున్నాఁడు వినుఁడు:

"ఆ. ఎద్దుకైనఁగాని యేడాది తెల్పిన
మాట దెలిసి నడుచు మర్మమెఱిఁగి
మొప్పె తెలియలేఁడు ముప్పదేండ్లకునైన..." (వే. జ్ఞా., 3౫౬)

ఇట్లైనను వేమనయందు బలవత్తరమైన గొప్పగుణమున్నది. అదేదనఁగా శ్రద్ధ. తాను గొప్పతత్త్వము నెఱిఁగితిసను దృఢమైన నమ్మికకు తోడు, బ్రదికి యుండు లోపల దానినంద ఱెఱుఁగునట్లు చేయవలయునను పట్టుదలయుఁ గల వాఁడు కావున, ఎవరు వినని, వినకపోని, తనపని తాను వదలలేదు. ఆ శ్రద్ధాగుణము చేత, ఇతనివలెనే యప్పటి సాంఘిక మతస్థితులతో తృప్తిలేనివారు అనేకులు ఇతనియం దేమోయున్నదని నమ్మి యాశ్రయించి యుందురు. అట్టివారి నితఁడు తాను నిరర్థకములని తేల్చుకొన్న హఠయోగము మొదలగు మార్గములలో దింపక, కేవల చిత్తశుద్ధి గలిగి శాంతిని సంపాదించు మార్గమును మాత్రము వారికి బోధించెను. శ్రీ కొమఱ్ఱాజు లక్ష్మణరావు పంతులుగారు ఇట్లు వ్రాసిరి:

"ఇట్లు కేవల శివాద్వైతియు, జాతి కులాభిమానమునకు నతీతుఁడును, పరోపకారమే పరమధర్మముగాఁ గల యాకవి చరమావస్థయందొక మతమును స్థాపించెనఁట. ఆ మతమును అంగీకరించువారు ఈ క్రింది యేడు సిద్ధాంతములను అంగీకరింపవలయును: (౧) దొంగతనము చేయరాదు. (౨) ఎల్లప్పుడును భూత దయ గలిగి యుండవలెను. (౩) ఇతరుల మనస్సు నొప్పింపరాదు. (౪) ఉన్న దానితో తృప్తిఁజెంది యుండవలయును. (౫) ఇతరులను మత్సరింపరాదు.

(౬) కోపము విడువవలెను. (౭) ఈశ్వరారాధన మెల్లప్పుడును జేయుచుండవలెను. క్రైస్తవులకు ౧౦ ఆజ్ఞ లెట్టివో యీ సంప్రదాయమువారి కీ సప్తాజ్ఞ లట్టివి."*

వేమనయొక్క పై మతము నాశ్రయించిన వారి నెవరిని గాని నేనుజూడ వీలుకలుగలేదు. ఇదే సత్యమైన యెడల, వేమన, సామాన్యజనులకు తత్త్వ విచారణ యందరాని పండని గుర్తించి, ఈశ్వరుఁడొక్కఁడు కలఁడనిమాత్రము తెలిపి, అతని నెఱుఁగుటకును, పరోపకారమునకును, తమ మనసు నెమ్మదికిని పనికివచ్చు పై నియమములను మాత్రము నిత్యముగా నాచరింపుఁడని సర్వమత సారమును శిష్యుల కుపదేశించినట్లు కానవచ్చుచున్నది. ఇతని శిష్యపరంపరవారు, ఈ మతము నెంతవఱకు ఆచరణలో నిలుపుకొన్నారో యెఱుఁగను. కటార్లపల్లె తుంగవేమన్న మతమును ఇదియేయైనను, అతని పరంపరవారతనికి ఉత్సవములు పూజలు చేయువేళ గొఱ్ఱెల యెనుబోతుల రక్తప్రవాహములతో అర్ఘ్యపాద్యము లిచ్చుచున్నారు! శిష్యులు గురువునకు విరోధముగానే వర్తించుట సృష్టియందలి రహస్యములలో నొకటి. అట్లు గాకుండుట సంభవించునేని, ప్రపంచమునకెల్ల, ఎల్లకాలమునకు, ఒక్క గురువు చాలునుగదా. కావున ఇతర మహాపురుషుల మతము లన్నియు శిష్యులలో నేయవస్థకు వచ్చినవో యంతకన్న మంచిస్థితిలో వేమన్న మతమువారు నేఁడుండిరేని యది పరమాశ్చర్యమగు విషయమే యగును.

వేమన్న తన యవసానకాలము నెక్కఁడగడపెనను విషయము యథాప్రకారము సందిగ్ధమే. పామూరివద్ద కొండగుహలో ప్రవేశించి మరల బైటికి రాలేదను వాడుకను మొదలే చెప్పితిని గదా? అంతకంటె బలవంతమైన సాక్ష్యము లభించు వఱకు నదియే నమ్మదగు. శ్రీ శంకరాచార్యులు ఇట్లే కడపట గుహాప్రవేశము చేసిరని వాడుక. ప్రపంచవ్యవహారమును చేతనైనంత నడిపి యఖండ బ్రహ్మాను భవానందమును జెందుటకై యోగులిట్లు చేయుదురు. కొందఱు శిష్యానుగ్రహార్థము ఎదోయొకచోట సజీవ సమాధిలో 'గోరీ' చేసికొందురు. తుంగవేమన్నది యిట్టి సమాధియే యని వెనుకఁ జెప్పితిని. ఇప్పటికిని వారు సజీవులై ముక్తిసుఖము ననుభవించుచున్నారనియే జనులు నమ్ముదురు.

వేమన్నయు నట్లే సుఖముగా నెందైన శాశ్వతముగా నుండనిండు! ప్రపంచము వలన ప్రపంచమునకై, యతఁడు పడిన కష్టములకు అంతమాత్రము నెమ్మది యైనను అతనికి గోరుట మనధర్మము!

---

*పై లక్ష్మణరావుగారి వ్యాస మముద్రితము. దానిని నేను పూర్తిగా చూడఁగల్గి యుండిన నెంతో లాభపడియుందును. కాని సాధ్యముగాలేదు. పై వ్యాసభాగము నం. సు. గారి వేమనలో నుదాహృతము (మా. పు. ౧౮౧).

శ్రీః

ఆఱవ యుపన్యాసము

# వేమన వంటివారు

మతము, రాజ్యము మొదలగు నేవిషయములందు సంఘమున కధఃపాతము గల్గినను దానినుద్ధరించి సంస్కరించుటకు ఒక్కఁడు జనించినఁజాలదు. అతఁడెంతటి మహాపురుషుఁడైనను మనుష్యుఁడే కావున మానవసామాన్యములగు నిర్బంధములకును మేరలకును లోఁగక తీఱదు. అందును జాతులు భాషలు వేఱువేఱుగాఁగల హిందూసంఘము వంటిదాని నొకఁడు నిర్వహింపఁగల్గుట యట్లుండనిండు; దానికి ప్రయత్నించుటయే యసాధ్యము. కావున నిట్టిసమయములలో సంస్కరణోద్రేకముతో నిండిన యనేకులు బయలుదేఱుదురు. మనకుఁ గల్గిన యిప్పటిరాజకీయాధఃపాతమును సంస్కరించుట కెందఱు మహామహు లవతరించుచున్నారు చూడుఁడు. ఇట్లే వైదికమతమును ఇతరమతములను వేఱువేఱుగా స్థాపించిన యాచార్యుల తరువాత, మనుష్యులకు సహజమైన సుఖకాంక్ష, స్వార్థపరత మొదలగు గుణములచే, ఆయా మతములవారు పారమార్థికదృష్టి చాలవఱకు నశించి, బహిరాడంబరములలో మాత్రము జాగ్రత్తగలిగి వర్తించుచు, అజ్ఞానమునకు అకార్యమునకును మతమొక సాధనముగాఁ జేసికొనఁగా, సామాన్యప్రజల నాయవస్థనుండి తప్పించి సన్మార్గమున కీడ్వవలెనని ప్రయత్నించిన వేమనవంటివారు హిందూసంఘ మం దనేకు లుదయించిరి. వారు తలఁచినదే సన్మార్గము కాకపోవచ్చును. కాని యిప్పటి సామాన్యసంఘమున్నదిమాత్రము సన్మార్గము కాదనుటలో సందేహము లేదు. తత్త్వము, నీతి, ధర్మము మున్నగువిషయములను తమ మనస్సాక్షిచేతను అనుభవముచేతను నిర్ణయించుటకుబదులు, తమపెద్దలు మాటలను వినియో, లేక వారిపెద్దలు వ్రాసిన గ్రంథములను చదివియో నిర్ణయించుస్థితికి వచ్చిన సంఘము బ్రతుకు బొమ్మలాటవంటిదే కాని సత్తువగలపదార్థము గానేరదు. అనఁగా, అందఱును తమంతట పైవిషయములను నిర్ణయించుకొనుట సాధ్యమా న్యాయమా? యని యడుగవచ్చును. అన్నిటికిని ఇతరులనే నమ్ముకొనుట యెంత న్యాయమో యిదియు నంతే; రెండును అనుచితములే. మన యనుభవములనే నమ్ముకొన్నప్పుడు మనయజ్ఞానము మనల నెంత చెఱచునో, యితరులను నమ్ముకొన్నప్పుడు వారి యజ్ఞానము మనల నంతే చెఱచును. మనుష్యుఁడు ఏ విషయమందును కేవల స్వతంత్రుఁడు గాఁడు; పట్టి పరతంత్రుఁడునుగాఁడు; మధ్యవర్తి; లేకున్న బ్రదుకనేరఁడు. కావున—

"క. వినవలె నెవ్వరు చెప్పిన
వినినంతనె వేగపడక వివరింపవలెన్
కని కల్ల నిజముఁ దెలిసిన
మనుజుఁడె పో నీతిపరుఁడు మహిలో సుమతీ."

యన్నట్లు *ఇతరులమతమును, వారెట్టివారైనను, తన విమర్శపుసానలోఁ బట్టి చూడ వలెను. అట్లుగాక వేదములు ఒకరు వ్రాయక తమంతటఁ బుట్టినవని, వానిలోనెల్ల నొకటేవిషయమును ప్రతిపాద్యమని, దానికి ప్రతిబింబము పంచమవేదము మహా భారతమని, దానిసారము భగవద్గీత యని, దానిని 'పసికి పండిలి చేసిన పిడుచ' తమ మతాచార్యుల భాష్యమేయని, దానికి తమ తాతగారు వ్రాసిన వ్యాఖ్యానమే సరియైనదని— కన్నులు మూసికొని, తలవంచుకొని, ఉన్నవివేచనాశక్తి కంతయు నూలునీళ్ళు వదలియుండుట ఆశక్తినిచ్చిన భగవంతునియెడఁజేయు మహాపచా రము. ఇట్లు మహాపురుషులగు మతకర్తలవతరించి చాలసూక్ష్మదృష్టిచే తత్త్వ ములను చర్చించి తమకుఁదోచిన సిద్ధాంతమును స్థాపింపఁగా, వారిమహత్త్వమును జూచి విస్మితులైన తరువాతివారు, దానికిమించి తామేమియు తెలిసికొనఁ జాలమని, దీనులై, తమ సర్వస్వమును వారికి ధారపోయుచు, తమకన్న సజ్ఞానులగువారు తమ విషయ మందట్లే విధేయతతో వర్తించునట్లు బోధించి, స్వాతంత్ర్య మనుపదార్థమే నశింపఁజేయుచుండఁగా, వారి నా నిద్రనుండి మేల్కొల్పుటకు స్వతంత్ర విమర్శ మును వారియెడ సంకురింపఁ జేయుటకు, కొందఱు బయలుదేఱకున్న ముక్తిలేదు ఇట్టివారిలో వేమన యాంధ్రులలో ముఖ్యుఁడని యెఱిఁగితిమి గదా! అతని వంటి వారిని మఱికొందఱినిగూర్చి నేఁడు సంగ్రహముగా విన్నవించుచున్నాను.

ఇట్టివారిలో వేమన్న తరువాత నందఱికంటె మొదలు మన మెఱుఁగఁ దగినవాఁడు—

## సర్వజ్ఞమూర్తి

ఇందుకు రెండు కారణములు గలవు. వేమన్నకితఁడు అచ్చపు ప్రతిబింబము వలె నుండుట యొకటి. రెండవది కన్నడమువాఁడగుట. మొదటినుండి తెలుఁగు వారికి కన్నడమువారియంత సమీపబంధువులు ఇతరులుగారు. దేశములు రెండును చాలపఱకంటుకొనియుండుటయేకాక, ఇరుతెగలవారును పలుమాఱొకరి నొకరు ఏలుచును, ఒక్కరాజునకే లోపడుచునుండి, మతప్రచారము, వాఙ్మయ రచనము మొదలగు విషయములం దొకరికొకరు సేవచేసినవారు. కావుననే యిరు వురి మార్గములును చాలవఱకొకటే తీఱుగా నుండును. అట్లగుటచేత వారు మనలఁ గూర్చియు, మనము వారిని గూర్చియు తెలిసికొనవలయుననుట ముఖ్యధర్మమని వేఱుగ చెప్పఁ బనిలేదు.

వేమన్న చరిత్రమునుగూర్చి యెన్నిచిక్కులుగలవో యితనినిగూర్చియు నన్ని కలవు. 'బసవరసు' అను ఆరాధ్యబ్రాహ్మణునికిని, అంబలూరు అను గ్రామము లోని కుమ్మరి విధవయగు 'మాళి' అను దానికిని ఇతఁడు జనించినట్లు కథ; కథయే కాదు, అతని పేరిటి పద్యములును గలవు.† కాని యితఁడు చిన్ననాఁటి నుండి తల్లిదండ్రులను లక్ష్యపెట్టక, తాను పరమేశ్వరుని వరమున జనించిన వాఁడనియు, మున్ను కైలాసమున ఈశ్వరుని సేవకుఁడైన పుష్పదత్తుఁడనువాఁ

*ఈ పద్యము వేమన పద్యములలోను గలదు, ౩౫౧౯.

†చూ. ధార్వాడ ఉత్తంగి చెన్నప్పగారు ప్రకటించిన 'సర్వజ్ఞపదగళు', పీఠికా ప్రకరణము.

డనియుఁ జెప్పుకొనెను. *వేమన్న కిట్టి సంకరజన్మకథ లేకున్నను అతనికి క్రమముగా తల్లిదండ్రులపై నభిమానము నశించినది—

"ఆ. తల్లిదండ్రిమీఁద దయలేని పుత్రుండు
పుట్టనేమి వాఁడు గిట్టనేమి?..." (౧౮౫౩)

అని వ్రాసినను, తుదకు

"ఆ. తల్లి గౌరియగును, తండ్రియౌ శంభుండు
ప్రమథగణము లఖిలబంధు వితతి
తనకుఁబుట్టినిల్లు తనరు కైలాసంబు..." (౧-౪౭)

వేమన్న కాలమైనను మేలు; సర్వజ్ఞునిదింకను చిక్కు. ఒక పద్యములో బసవేశ్వరుని శిష్యుఁడని యున్నది (౯౪౫). వేఱొకపద్యములో ఇంగ్లీషువారు శ్రీరంగపట్టణమును వశపఱచుకొన్న విషయమున్నది! (౧౦౦౧) అనఁగా, పండ్రెండవ శతాబ్దము మొదలు పదునెనిమిదవ శతకమువఱకును ఇతనిజీవిత మన్నమాట!' ఇతనిని గూర్చి యెక్కువ పరిశోధనచేసి పద్యములను ప్రకటించిన ఉత్తంగి చెన్నప్ప గారు పదునాఱవ శతాబ్దము వాఁడై యుండునని యూహచేసిరి.† కాని యదియు సాధనములులేని చరిత్రకారుల యూహలవంటిదే కాని, యెక్కువ నమ్మఁదగినది గాదు.

ఇతఁడు తలిదండ్రులను తిరస్కరించె నంటిని. దానికి కారణము వట్టిదౌర్త్యమై యుండదు. ఇతని జన్మ విచారమును బేర్కొని, జనులపహసింపఁగా తాను సామాన్య మనుష్య మాత్రుఁడను గానని వారి కితఁడు ప్రతిఘటించి నిలిచి యుండును. 'శూద్ర ప్రజ్ఞలు', 'కాపు కవిత్వములు' మనలో ప్రాఁతమాటలేకదా. ఇట్లు జాతినిబట్టి వ్యక్తిని తిరస్కరించువారిపై నితఁడు కత్తిగట్టెను గావుననే యిట్లను చున్నాఁడు—

"ముత్తు నీరలి హుట్టి హత్తు సావిర హడగు;
హత్తు చిప్పొందు హణమిల్ల; తాయ్తుందె
ఎత్తణవరెంబ సర్వజ్ఞ." (౧౦౦౨)

(నీటఁబుట్టిన ముత్యము పదివేలుచేయును. అట్టి కప్పచిప్పలు పదివేసినను ఒక రూక చేయవు. తలిదండ్రు లెక్కడిలెక్క? అన్నాఁడు సర్వజ్ఞుఁడు.)

వేమనకువలెనే యితనికిని తనశక్తియం దెక్కువ నమ్మకముగలదు. ఇతని సర్వజ్ఞుఁడను పేరుగూడ తలిదండ్రులు పెట్టినపేరుగాఁ దోఁపదు. సర్వజ్ఞుడను బిరుదు గలవారనేకులున్నారు గాని, అట్టి పేరుగలవారి నిదివఱకును నే నెఱుఁగను. ఇఁక ఇతఁడును పండితుఁడు గాఁడు గావున, ఇతనిశక్తికి మెచ్చి యే ప్రభువుగాని యేకాలమున నీ బిరుదు నిచ్చియుండఁడు. కావున యెవరో యితని ధూర్తపుమాటలు విని 'వీఁడేమి సర్వజ్ఞుఁడా?' యని యాక్షేపించిరి గాఁబోలు. 'ఏల కాఁగూడదు?' అని ఆ పేరే యతఁడుంచుకొని పద్యములు రచించి వారిమొగమునఁ బాఱవేయఁ జొచ్చెనేమో! ఇదియే నిజమేని తన పుట్టినపేరు జాతి మార్చుకోఁదలపని వేమన్న కన్న సంఘతిరస్కారమున నితఁడొక మెట్టు ముందు పడినాఁడని చెప్పవచ్చును.

వేమనవలె నితఁడును చాలవఱ కుద్రిక్తస్వభావము కలవాఁడు. చదువు

---

*చూ. ప. ౨-౧౪.

†చూ. సర్వ. పీఠిక., పు. ౩౯.

సంధ్యల నిర్బంధమున కెక్కువ లోఁగినవాఁడు కాఁడు. సహజముగా పదనైన కవితాశక్తి కలవాఁడు. హాస్యప్రియుఁడు. 'నక్కునగిసువానుడిలేసు' (నవ్వి నవ్వించుమాట లెస్స) యని నిర్ణయించినవాఁడు (౧౨౩౬). అట్లే నవ్వి నవ్వింపఁ గలవాఁడు. కావుననే ఇహలోకసౌఖ్యమును వేమన్నకన్న నెక్కువ ప్రీతితో తృప్తితో ననుభవించినవాఁడు. వేమన్నయందు చిన్ననాఁటినుండి అతృప్తియను ధర్మము మితిమీరియున్నది. ఇతనియందును గలదుగాని యంతలేదు. అనఁగా, నితడు గొప్ప ధనవంతుఁడుగా నుండెననికాదు. తృప్తి మనోధర్మము గాని వస్తుధర్మము గాదు. వేమనవలె నితనికిని నేయి, పాలు, పెఱుఁగు, పప్పు మొదలగు సామాన్య వస్తువులమీఁదనే కాక, మినుపవడలు, ఓళిగలు, కజ్జాయములు మొదలగు విశేషపు తిను బండములపైఁగూడ నాదరము మెండైనను, జొన్నలు, కొఱ్ఱలు, రాగులు మొదలగు ధాన్యములపైనను అభిమానముగలదు*. ఇతని సంసారలక్షణ మేమనఁగా: వెచ్చని యిల్లు, వెచ్చమునకు డబ్బు, రెండెద్దులు, ఐదుగురు కొడుకులు (?), వట్టిపోని ఆవులు, వెనుదీయక పనిచేయుకోడలు, ఒక ముసలి యవ్వ, తన యిచ్ఛనెఱుఁగఁగల గుణవతియగు భార్య—ఇవి యున్నచో 'స్వర్గక్కెకిచ్చు హచ్చెంద సర్వజ్ఞ' (పే. ౨౬౭). స్వర్గమునకు నిప్పంటించు మన్నాఁడు సర్వజ్ఞుఁడు. అనఁగా, నితడు వేమనకంటె బుద్ధిమంతుఁడై యేక పత్నీవ్రతమును మర్యాదగా పాలించి బ్రతికినవాఁడని యూహింపకుఁడు. అతనివలె నితఁడును జారస్త్రీలు, వేశ్యలు మొదలగు వారికి లోపడుటయే కాక, ఆ ప్రపంచమున నతనికన్న నొకచేయి యెక్కువగానే పోరాడినవాఁడని చెప్పవలసి యున్నది. ఎట్టివారు జార స్త్రీలను విషయమును తెలుపుటకితఁ డనేకపద్యములు వ్రాసినాఁడు (౧౬౬౪-౧౭౭౧). స్త్రీవశీకరణమునకు తక్కిన వెఱువెల్లఁకులేమియుఁ బనిలేదఁట. బంగారువేఱుచే వారు తప్పక స్వాధీనమవుదురఁట! (౧౬౨౮) ఇట్లే వేశ్యలను గూర్చియు పలుపద్యములితఁడు వ్రాసెను (పే. ౨౮౯). వారి విషయముగా నొక్క మంచిమాటయైనను వ్రాయలేదు సరిగదా, మీఁదుమిక్కిలి వట్టిమాటలచే వారిని మరులు కొలిపి డబ్బీయక దగాచేసినవాఁడే జాణయనియు నొకచోటఁ జెప్పినాఁడు! (౧౭౬౬) కాని యీవర్తనము అనుచితమని యితఁడెఱుఁగును. ఇతరులకట్లే బోధించెను. నిజమైన సుఖమేదనఁగా—

"జోళదా బోనాగి మేలె కెనె మొసరాగి
వేళెగె బరువ సతియాగె, సూళెయను
కోళ దిక్కెంద సర్వజ్ఞ" (౧౪౪౯)

జొన్నన్నము, మీఁగడపెరుగు, వేళకువచ్చుసతి—ఇవియున్నచో వేశ్యను కొఱుతవేయుము—అని యర్థము. అవి లేనప్పుడు వేశ్య పనికివచ్చునని తాత్పర్యము!

ఇట్టి తృప్తిగల స్వభావము గలవాఁడు గావుననే, వేమనవలె అడుగడుగు నకును బ్రహ్మను దిట్టక, మనకు తెలియని విషయములను గూర్చి చింతించి, మనకు సాధ్యముగాని కార్యములను సాధింపఁ బ్రయత్నించి, అవస్థపడుటకన్న 'శివతోరిదంతిహుదె లేసు సర్వజ్ఞ'—శివుఁడు చూపినట్లుండుట లెస్స—యను కొన్నాఁడు (౮౧౪)—

---

*చూ. లేసుపద్ధతి, అన్నపద్ధతి.

"బందీతు రోగ నినగెందు అంజికె బేడ,
బందుదను ఉండు సుఖిసుత్త, రోగబం
దందిగెద్దేళు సర్వజ్ఞ." (3४3)

(రోగమువచ్చునేమోయని భయపడవలదు. వచ్చినదితిని సుఖింపుము. రోగము వచ్చినపుడు లేచి పొమ్ము.)

అనఁగా, ఇతఁడు శాంతమూర్తియై, చప్పుడులేక, యనేకులవలె చప్పిడి బ్రతుకు బ్రతికినవాఁడని కాదు. వేమనవలెనే యితనిని రేగఁబెట్టుటయు భేరిని 'జోకొట్టినట్లే'. మాటలపదనులో ఇరువురును ఒకరికొకరు ఎందును దీసిపోరు. ఇద్దఱి తిట్లును తెగని చేఁదుగలవే. కాని వేమన్నకన్న నితనిలో నెమ్మది, ఉదాసీనము కొంచె మెక్కువగాఁ గానవచ్చును. కావుననే వేమన కున్నంత అసహ్యము ప్రపంచముపై నితనికుండలేదు.

వేమనవలె నితనికిని సంగీతమందభిరుచి కలదు. అతనికన్న కొంచెమెక్కువ ప్రవేశము గలదేమో. తంతివాద్యము మేలని అందును వీణ లెస్స యని యితఁడును తలఁచెను (౧౦౨౮). వేమనకు ప్రియమైన ఆటవెలఁదికన్న ఇతని త్రిపది సంగీతమున కెక్కువ పనికివచ్చు స్థిరమైన లయగతిగలది ఇది పద్యమనుట కన్న పాటయనుటయే మేలు. ఏక వాదము వేమన్నకన్న నితని కెక్కువ పనికి వచ్చును. ఈ త్రిపదిలో పద్యములవలె, గురువు గురువు గాను లఘువు లఘువు గాను ఉచ్చరించినఁజాలదు! తాళపు నడకకుతగినట్లుగా రెండును కొంతమార్చి సరిచేసికొనవలసి యుండును. సంగీతగాంధ కితని యుపదేశ మొకటి చాల విలువయైనది కలదు—

"అర్థవిల్లదహాడు వ్యర్థసాసిర విద్దు,
అర్తియిం కత్తె యరచి, దపల్లి
అర్థవుంటెంద సర్వజ్ఞ." (౧౨౦౮)

(అర్థములేని పాటలు వేయియైనను వ్యర్థము. మనసిచ్చి గాడిద యరచినను అందును అర్థముగలదు.) అర్థములేనిపాట యంతకంటెచెడుగని భావము. వేమన్నకు తోడిరాగముపైఁ బ్రీతియుంటిని. ఇతఁడు నాటిరాగము లెస్స యను చున్నాఁడు (౨౬౯). తోడివలె దీనియందును అసహ్యము, పట్టుదల, అతృప్తి, స్వతంత్రము మొదలగు భావములను జూపవచ్చునైనను, దైన్యము దానియందు వలె దీనియందంత స్పష్టముగాఁ జూపసాధ్యముగాదు. మనుష్యుఁడనై, యెందుకును జేఁతగాని వాఁడనై, యేమియుఁ దెలియనివాఁడనై, పుట్టితినే యను దుఃఖము వేమనకున్నది; నిజమే కాని దానినిగూర్చి దుఃఖించిన 'దేహము కృశించునే' కాని (౮౧౪) ఫలములేదు గావున ఉన్న నాల్గునాళ్లు చేతనైనంత పనిచేసి తనకును ఇతరులకును సుఖముగా బ్రతికి చత్తమను భావము సర్వజ్ఞునిది. నాటి రాగమందీ ధీరగుణము చక్కగాఁ జూపవచ్చును.

కావున యుద్ధసమయములందు శౌర్యము, ప్రాణమునకు వెఱవకుండుట, ఇత్యాది గుణముల నితఁడు చాల ప్రశంసించి యున్నాఁడు. "అమ్మనాడిసి యుపదు బొమ్మ నాదడెయేను?" (౬౨౯)—బ్రహ్మయెదురు పడిననేమి? తన బిరుదును జెప్పిపోడుపవలయును—అని యితని మతము. 'జాతి వీరరునావభీతి గంజుళివరే?' (౬౨౮)—'జాతివీరులు చచ్చుటకు వెఱచి వెనుదీయుదురా' యనియు 'మురిదు బందగా తరియదాకత్తియు, సరెదు ముక్కువనె!'(౬౭౫) —

'తెగివచ్చినపుడు నరుకలేని యా కత్తి యేల నూరుకొని త్రాగుటకా?' యనియు నితఁడతి తీవ్రముగాఁ బలుకును.

"ఆ. పరబలంబుఁ జూచి ప్రాణరక్షణమున
కురికి పాఱిపోవు పిరికినరుఁడు ;
యముఁడు అలిగితేను యప్పరఢ్ఢంబయా ?..." (౨౪౩౨)

అని వేమన్నగూడఁ జెప్పెను. కాని యావిధమైన శౌర్యంబునందు అతనికంత యభినివేశము కానరాదు.

ఇట్లు శౌర్యమునందును సంసారసుఖమునందును ఆశగలవాఁడు కావుననే యితఁడు దానిని దీర్చుకొనుటకు కొన్నాళ్లు రాజసేవ చేసినట్లున్నది. వేమనయు చేసియుండునని యూహించితిమిగాని యతనికది చాలదినములు సాఁగియుండదు. ఈ విషయమం దితనికున్నంత యనుభవ మతనికి లేదు. ఆ నిప్పును చాలనాళ్లు అణఁచిపెట్టుకొనఁగల రాజు ఆ కాలమందే కాదు, ఏ కాలమందును గలుగఁడు. ద్రవ్యార్జనకై కొన్ని దినములాపని చేసిచూచి త్వరలోనే యతఁడు విసిగి—

"ఆ. ఎంత సేవఁజేసి యేపాటుపడినను
రాచమూక నమ్మరాదురన్న !
పాముతోడి పొందు పదివేలకైనను..." (౬౩౮)

అని తెలిసికొని యా పీడవదలించుకొనెను. సర్వజ్ఞుఁ డట్లుగాక, రాజుల చిత్తవృత్తి నాశ్రయించి నడిచి, వారి మంత్రుల యడుగులకుమడుఁగులొత్తి, కొలువులోని తక్కిన పెద్దవారియెడ వినయవిధేయతలు చూపి సేవించినాఁడు (౬౪౫-౬౬౦). 'స్వామి కార్యక్కె మడియలేబేకు' (౭౦౬) 'స్వామి కార్యమునకై చచ్చియే తీరవలయును' అని సంకల్పించి ఒడలు దాఁచక వారికై పోరినాఁడు. కాని, జారత్వము, చోరత్వము, అసత్యము మొదలగు దుర్గుణములు వారియందు చూచి, వాని ఫలమనుభవించి విసిగి వేసరినాఁడు. *తుదకు 'బిన్నపవ కేళదర సినోలగదింద సన్యాసలేసు' 'మనవిని వినని దొరకొలువుకన్న సన్యాసముమేలు' (౬౯౦) అని నిశ్చయించుకొన్నాఁడు.

మొదటినుండి యితఁడును బసవేశ్వరప్రతిపాదితమైన లింగధారివీరశైవ మతమునకుఁ జేరినవాఁడు. కావున నితనికి తలఁచుకొన్నప్పుడు సన్యాసమిచ్చు శివయోగులకు ఆ మతమునకుఁ జేరినవారిలో కరవులేదు. ఇట్టివారిలో నెవఁడో యితనిని జంగముగాఁ జేసి యోగమార్గ ముపదేశించినాఁడని తోఁచుచున్నది. కాని యా యోగసాధనకు మొదలు ఇతనికి, సామాన్యముగ సందఱివలె, బహిరంగ వేషములందు నమ్మిక కలదు. విభూతిరుద్రాక్షలు ధరించిన వానికి పాపము బయలై ఉన్నచోటికి శివుఁడు వచ్చునని యితఁడు తలఁచెను (౯౯). లింగములేక యేదియు తినరాదు (౧౦౮). తానుభుజించు వస్తువులనెల్ల మొదలు శివార్పణము చేసి పిమ్మట భుజింపవలెను (౧౦౭). జంగములు సాక్షాచ్ఛివస్వరూపులు. వారి కిచ్చిన శివునికి నైవేద్యము చేసినట్లే (౧౪౨). కావున 'తిరుదు తందాదరూ కరెదు జంగమకిక్కు' 'తిరిపెమెత్తి తెచ్చియైనను పిలిచి జంగానికి పెట్టుము' (౫౪౯) అని యితనిబోధ. ఔదార్యవిషయమున వేమనవలెనే యితఁడును అతివాదియై 'తిరిపెమెత్తియో పీడించియో దొంగిలించియో తెచ్చి పిలిచి దానమిమ్ము' (౫౫౦)

---

*చూ. రాజనీతిపద్ధతి.

అని చెప్పినను, దానపాత్రవిషయమున అతనికున్నంత విశాలదృష్టి యితని కున్నట్లు తోఁపదు. ఇతనిమతమున అందఱికిచ్చుటకన్న శివభక్తులకిచ్చు దానమే శ్రేష్ఠము (౨౨౧-౨౨౩). కాని గతిలేని చేతఁగానివారేమి దానము చేయఁగలరు? ఇతని యుత్తరము, 'జంగాలు తెచ్చిన బియ్యము వండి పెట్టుట, ఉండుటకు తావిచ్చుట, తాగుటకు నీరిచ్చుట? (౨౨౪) ఇది గూడ చేయలేని పేదవారుండరు గదా!'

ఇట్లితనికి వేమన్నకన్న శివపక్షపాతమును, ఇతరదేవతలయం దనాదరమును కొంచెమెక్కువగా నుండెను. 'నరసింహుని యవతారము పెద్ద విచిత్రమే కాని శరభుఁడు గోటితోఁ జంపునపుడు విష్ణువూరినక్కవలె నాయెను' (౧౮౨). కావున 'పదిజన్మములెత్తి ఎద్దుగేదెలను గాచి, పాండవుల సేవకుఁడైన హరి యేటిదేవుఁడు?' అని యితఁడు ప్రశ్నించుచున్నాఁడు (౧౮౪). కాని యోగసాధనకుఁబూని చేయఁగా అందుఁగలుగు చిత్రవిచిత్రములగు ననుభవములు గమనించి, బ్రహ్మసాక్షాత్కార సౌఖ్యమనుభవించుటకు మొదలిడినవెంటనే యితనికీ బహిరంగములగు భావము లన్నియు వేమనకువలెనే నశించినవి. ఈ విగ్రహపూజలు, ఈ వేదవాదములు, ఈ జాతిభేదములు మొదలగునవన్నియు తత్త్వనిశ్చయమునకెందుకును తరముగావని తలఁచెను. "చెడురాళ్ళకు వట్టిపూజ చేయకు వేమా!" (౫౩౮౫) యని చెప్పిన యతనివలెనే యితనికిని, దేవళమందలి శివలింగము సంబారము నూఱుటకు పనికివచ్చుగుండేకాని వేఱుకాదని తోఁచినది. "సంబారవరేవ బలుకల్లు హరనెందు నంబువవరారు సర్వజ్ఞ" (౧౬౨). ఎన్ని వేదములున్న నేమిఫలము? "అనుభవియు వేద వే వేద" (౭౧౬)—అనుభవించిన వాని వేదమే వేదము. మఱియు "నాల్గు వేదములును నాల్గుచన్నులు; నాదమేనురుగు పాలు, దీనిని సాధించుశక్తి శివయోగికి తప్ప తక్కినవారికిలేదు" (౪౫౪). వేమనయు "వేదసారమెల్ల వేమన యెఱుఁగును" (౩౬౦౮) అని చెప్పెను. యోగులెల్ల నిట్లే చెప్పుకొందురు.

"మథిత్వా "చతురోవేదాన్ సర్వశాస్త్రాణి చైవహి
సారస్తు యోగిభిః పీతస్తక్రం పిబతి పణ్డితః"

(జ్ఞానసంకలినీ తంత్రము, ౨౦)

(అన్ని వేదములును శాస్త్రములును మథించి యోగులు సారము త్రాగుదురు. పండితుఁడు వట్టి మజ్జిగ త్రాగును.)

కాఁబట్టి జ్ఞానికి వాదముతోఁబనిలేదు. మఱియు బ్రహ్మజ్ఞానము గలవాఁ డూరకుండవలయునే కాని దానినిగూర్చి చర్చించుట, దొంగిలింపఁ బోయినవాఁడు తుమ్మినట్లగును (౩౫౪). వేమనయు "లోచూపుచూడ నొల్లక వాచాబ్రహ్మంబు పలుకవలదుర వేమా" యని చెప్పెను (౩౩౪౦). యజ్ఞయాగాదులందతని కెంత ద్వేషమో యితనికి నంతే. ఒక మేకను జంపి తిన్నవాఁడు స్వర్గమును జేరఁగల్గునేని యెప్పుడును మేకలను లెక్కలేక చంపి తిను కటికవాఁడు దేవేంద్రుఁడే కావలదా? యని యితని ప్రశ్న (౭౪౮). ఇఁక వేమనవలెనే జాతిభేదములనుగూర్చి దంచెత్తిన బసవన్నమతమునఁ బెరిగిన యితనికిని పరబ్రహ్మానుభవము తోడై, యితనిని వానికి పరమశత్రువుగాఁ జేసినది. అందఱికన్న నెక్కువయనఁబడు బ్రాహ్మణులయెడ ద్వేషమును, తక్కువ యనఁబడిన చండాలులందు కనికరమును గలిగినది. బ్రాహ్మణులు ధర్మచ్యుతులైరనియే యితనికిని వేమన్నవలె వారిపై కోపము. యోగ ధ్యానముల నెఱుఁగక బ్రాహ్మణులు భోగులైపోయిరని వగచెను (౭౫౨). "తల్లి శూద్రురాలు తానెట్లు బాఁపఁడు?" (౧౪౮౬) అని యడిగిన వేమన్న వలెనే,

వడుగుజందెములేవియులేని తల్లి భార్య మొదలగువారితో కలిసి వర్తించినను, అట్టి శూద్రులను దాఁకక వారికన్న తానెక్కువయను బ్రాహ్మణుని దేటి బ్రాహ్మణత్వ మని యడిగెను (౮౨౪). వారిని నమ్మి యెవరు బ్రతికినారని యతనివలె నితఁడును ఆక్రోశించెను ! (౯౦౪) కాని నీతి నెఱిఁగిన బ్రాహ్మణుఁడు లోకమునకు జ్యోతివంటి వాఁడని నిర్వంచనగాఁజెప్పెను (౮౮౮). కావున జన్మసిద్ధములైన యెచ్చుదక్కువలు దబ్బర; 'ఒక భూమిపై నడిచి, ఒక నీటినే త్రాగి ఒక యగ్నిలోనందఱు మండి పోవుచుండఁగా, నడుమ కులగోత్రము లెక్కడివి?' (౮౪౯) కావున "స్వర్గది హొలెగేరి యిల్ల" (౮౬౩) "దేవరలి కులభేదవిల్ల" (౮౬౪): స్వర్గమున మాలవాడ లేదనియు, దేవునికి కులభేదము లేదనియు, ఖండితముగా నమ్మఁ జెప్పెను.

ఇఁక నాదేవుఁ డెట్టివాఁడు? అతఁడు జగమునకెల్ల నొకఁడే ప్రభువు (౧౫౦). అతఁడు శివుఁడు. నిరాకారుఁడు (౯౫); సర్వవ్యాపి; పాలలో నేయివలె, నీటిలో నగ్నివలె అన్నిటియందును గలఁడు (౨౪౫). నీవున్న చోటనే నీలోనే కలఁడు (౨౪౬). అదెట్లు సాధ్యమని యెవరైన ప్రశ్నించిరేని—

"నణ్ణనెయ మళలొళగె నుణ్ణనెయ శిలెయొళగె
బణ్ణిసి బరెద పటదొళగె, ఇరువాత
తన్నల్లి యిరనె సర్వజ్ఞ?" (౨౮౦)

'నన్నని యిసుకలో, నున్నని రాతిలో, వన్నెల పటములలో ఉండగలవాఁడు, నీలో నాలో నుండలేఁడా?' యని యితఁడు ప్రతిప్రశ్న వేయుచున్నాఁడు. యోగ సమాధిలో నిలిచి, అన్ని భేదములను మఱచి, తానే తానైయున్న, నందే బ్రహ్మ సాక్షాత్కరించును (౨౮౨). జీవులకే అజ్ఞానరూపమగు మాయ కలదు గాని యతనికి లేదు (౨౮౪). తన్ను తానెఱిఁగిన నా మాయ నశించును (౩౦౬).

ఇట్లు జీవ బ్రహ్మలకు భేదమే యితని యనుభవమునకు వచ్చినదిగాని, వేమనకువలె పరిపూర్ణాద్వైతానుభవము కలిగినట్లు తోపఁదు. శివపక్ష పాతము మొదలు గలిగినను కడపట "ముగ్గురికందని మూలమూర్తి యొకండు" (౩౧౦౩) యని చెప్పి "తన్ను తానెఱిఁగిన తానెపో బ్రహ్మంబు" (౧౪౮౪) అన్న వేమనవలె నిశ్చయముగా నితఁడు చెప్పలేఁడయ్యెను. అతనివలె అతృప్తితో ముందుముందింకను జూడవలెనను నాశ లేక, కొంతవఱకు దొరికినదానికి సంతోషించు స్వభావము గలవాఁడగుటయే యిందుకు కారణమని తలంచుచున్నాను. పరమఫలమైన యద్వైతావస్థ లభింపకున్నను, హఠరాజయోగముల యభ్యాసముచే నితనికి వేమన్నకుఁ గలిగిన తక్కిన ఫలము లన్నియు—సర్వసమత, బహిరంగద్వేషము మొదలగునవి— లభించినవి. మఱియు, బ్రహ్మద్వైతమును సాధింపవలయునని యితఁడు ప్రయత్నింపనే లేదని చెప్పవచ్చును—

"అద్వైతకోడాడి యిద్దుదను హొగాడి
ఉద్దన మరద తుదిగేరి, కైజారి
బిద్దు సత్తంతె సర్వజ్ఞ." (౨౮౫)

'అద్వైతమునకై తిరిగి యున్నది పోఁగొట్టుకొనుట, పొడువైన మ్రాని తుద కెక్కి చేయిజారి పడి చచ్చినట్లు' అని యనుకొన్న వాఁడితఁడు. కాని యితనికి జీవాద్వైతము—అనగా, ప్రాణులందఱు నొకటేయనుట—సిద్ధించినది. "తానద్వైతమైన పిదప ఎవరితో కలహింపవలెను? బుద్ధిలో తన్నెఱిఁగిన వానికి లోకపు జగడములు లేవు" (౩౩౪) కావున నిజమైన యోగి వేషము, తిండి మొదలగు వానిఁ

గూర్చి కలఁతలు పెట్టుకొనక, దొరికినది తిని దొరకకున్న నూరకుండి, యే యింటి పంచనో యే చెట్టుక్రిందనో పరుండి, యెప్పుడును శివధ్యానానంద మనుభవించుచు, చావు వచ్చినపుడు సంతోషముగా లేచిపోవ సిద్ధముగా నుండవలసినదే కాని, సంసారమునఁబడి ఆలుబిడ్డల పంచనుండిన కైలాసము లభింపదనియే సర్వజ్ఞుఁడు తలఁచెను. వేమనవలెనే యితనికిని అడవుల కొండలఁ బడియుండుట యసహ్యము. మనసులో ధ్యానించువానికి ఇల్లు, మఠము, అడవి, కొండ అన్నియు నొకటే యనియు, అదిలేని వాఁడు దేవళము 'గర్భగుడి'లో నున్నను, కొండ కొననున్నను ఒకటియే యనియు నితఁడన్నాఁడు (౨౧౮). ఇతఁడు తన జీవితము నిట్లే కడపె ననుటలో సందేహము లేదు. కాని యంతకన్న నెక్కువ తెలియదు.

వేమన వలెనే యితఁడును ప్రాలకందక వేలసంఖ్యగా పద్యములు చెప్పిన వాఁడు. సమయము దొరకినప్పుడెల్ల మాటలకు బదులుగా పాటలే యుపయోగించిన వాఁడు. ఈవిషయ మావిషయ మనకుండ దొరకినదానిపైనెల్ల పదము లల్లిపారవేసిన వాఁడు. ఇట్లు అట్లు అనక వచ్చినట్లెల్ల వాగిననోరితనిదిగూడ. శబ్దములు సహ్యములు కాకపోవచ్చును; అర్థమన్యాయము గావచ్చును; కాని అశక్తిమాటలు, అంటని భావములు ఇతనినోటినుండి వెడలవు. వేమన వలెనే యితఁడును దేశ సంచారముచేసి తనకుఁ దెలిసిన తత్త్వనీతి ధర్మములను ప్రాస్తావికముగా ప్రజలకు బోధించిన వాఁడే. కాని యతనికన్న నితనికి లౌకిక మెక్కువ. తన మాటలు వినని మూర్ఖులనతఁడు ఎద్దులని, గులాములని, గాడ్దెలని చెడఁదిట్టినవాఁడు. ఇతఁడును అట్టి కుంటేటికాళ్ళ వాదమువారి నెదుర్కొనక పోలేదు. కాని వారితో కలహించుట కిష్టములేదు: ఫలములేదు గావున. వారిని గూర్చి యితఁడే మన్నాఁడో వినుఁడు—

"నెలవన్ను ముగిలన్ను హొలివరుంటెందరే
హొలివరు హొలివరెన బేకు ; మూర్ఖసలి
కలహవే బేడ సర్వజ్ఞ." (౯౪౦)

(భూమిని ఆకాశమును చేర్చి కుట్టఁగలవారున్నారనిన, కుట్టఁగలరు కుట్టఁగల రనవలెను, మూర్ఖులతో కలహమేవలదు); కావున 'మూర్ఖను అందంతె అన్ని': 'మూర్ఖుఁడు చెప్పినట్లు చెప్పుఁడు' అని యితఁడు బోధించెను (౯౪౩).

తొడకులేని ధారాళమైన శయ్య, అందఱికిని అర్థమగు భాష, ఎల్లరు అనుభవించి యెఱిఁగిన యుపమానములు, మఱుఁగులేని మాటలు, నవ్వినవ్వించు హాస్యము—ఇవి ఇతని కవిత్వమందును ముఖ్యతత్త్వములు. జ్యోతిషము, వైద్యము, శకున శాస్త్రము, కామశాస్త్రము—మొదలగువాని యందితనికి వేమన కంటె నెక్కువ ప్రవేశము గలదు. రసవాదమందును అతనికున్నంత నమ్మికయు ననుభవమును గలదు. అసభ్య విషయముల నిరువురికిని ఎగ్గులేదు. ఇరువురును అర్థముగాని 'కూట' పద్యములను అందందు వ్రాసినవారే. ఇట్లు, స్వభావము నందలి యల్పభేదముచేత దృష్టిలోను ఇరువురికిని కొంత భేదముగానవచ్చినను, మొత్తముమీఁద ఇరువురును ఒకరినొకరు తీర్చిన ప్రతిమ లనవచ్చును.

ఇదిగాక యిరువురును ఒకరితోనొకరు మాటలాడుకొని వ్రాసినట్లున్న పద్యములు కొన్నిగలవు. చూడుఁడు—

(౧) "కట్టలూబిడలు శివ ఖట్టలవ కద్దనే ?
కట్టలూ బేడ ; బిడబేడ ; కణ్మనవ కట్టిదరె సాకు సర్వజ్ఞ." (౧౪౮)

"ఆ. బండెతాళ్ళుదెచ్చి బంధించి కట్టఁగ
లింగఁడేమి దొంగిలించినాఁడొ?
ఆత్మలింగమునకు నర్పింపనేరరో?" (౨౬౮౫)

(౨) "ఒడల దండిసి ముక్తిపడెవె నెంబుప హెడ్డ
బడిగెయలి హుత్త హొడియలడగిహ సర్ప,
మడియువదె హేళు; సర్వజ్ఞ" (౫౧౦)

"ఆ. ఒడలు బడలఁజేసి యోగులమనువారు
మనసు కల్మషంబు మాన్పలేరు
పుట్టమీఁదఁ గొట్ట భుజగంబు చచ్చునా?..." (౮౦౬)

(3) "కొట్టు బహ కాలదలి కొట్టుణలి కరియదే
హుట్టియ ఒళగె జేనిక్క, పరరింగె కొట్టు హొాదంతె సర్వజ్ఞ."
(౬౦౫)

"ఆ. ధనముఁ గూడఁబెట్టి ధర్మంబు సేయక
తాను లెన్నదినక దాఁచు లోభి;
తేనె నీగగూర్చి తెరువరికియ్యదా?..." (౨౧౦౭)

(౪) "కల్లుప్పు కర్పురవు సొల్లెపడు ధాతొందు,
ఖుల్ల నొళ్ళిదన రూపొందు, గుణదొళగె,
ఎల్ల అంతరవు సర్వజ్ఞ." (౭౨౭)

"ఆ. ఉప్పు కప్పురంబు నొక్కపోలికనుండు
చూడఁ జూడ రుచుల జాడవేఱు
పురుషులందు పుణ్యపురుషులు వేఱయా..." (౫౩౪)

ఇట్టి వింకనుగలవు. ఈపోలికలు కేవలమాకస్మికములేనా, లేక యొకరినింకొకరుచూసి వ్రాయుటచేఁగల్గినవా యను చర్చకుఁ జేయివేసి ఫలములేదు. అనలిరువురి కాలము స్పష్టముగా నిర్ణీతము గాలేదు. కావున ఇరువురిలో నెవరు మొదలుండిరో చెప్పలేము. ఉత్తంగి చెన్నప్పగారు భావించునట్లు సర్వజ్ఞుఁడు పదునాఱవ శతాబ్దమువాఁడై, వేమన మనము తలఁచినట్లు పదునేడవ శతకపు తుదిలోనివాఁడే యైనచో వేమనయే యితని ననుసరించె ననవచ్చును. కాని వేమన్న కన్నడదేశమునకు సమీపమందున్నవాఁడైనను, తెనుఁగుదేశమందును అరవదేశమందును తిరిగినట్లు కానవచ్చుచున్నదే కాని, కన్నడుల సహవాసమతనికి లభించెనని స్పష్టముగాఁ జెప్ప వీలులేదు. తెలుఁగుదేశమున సర్వజ్ఞుని పదములకు వ్యాప్తి కానరాదు గాని, యతఁడు ఇందు కొంత సంచరించినట్లున్నది. తెలుఁగువారి నితఁడు తిట్టి వ్రాసిన పద్యములు గలవు (౧౨౫౪-౫౫). శ్రీరాములు లంకను జయించిన తరువాత లంకలోని స్త్రీలకును కిష్కింధాపట్టణపు పురుషులకును జరిగిన సంమసంస్కార వివాహముల ఫలము తెలుఁగువారని యితని మనుష్యశాస్త్ర సిద్ధాంతము (౧౨౫౫)! మఱియు, కన్నడదేశమందు వలసపోయి నిలిచిన యాంధ్రు లనేకులు గలరు. ములకనాటి బ్రాహ్మణులు, కోమట్లు, మంగలివారు, భట్టురాజులు మొదలగు తెలుఁగువా రనేకులు మైసూరు సీమలో నిప్పుడును గలరు. కాని కన్నడు లాంధ్రదేశమందు చాల తక్కువ. కావుననే వేమన పద్యములకు కన్నడసీమలో కొంత ప్రచారము గలదు. కనుక వేమన్న వాసనయే సర్వజ్ఞునకుఁ దగిలియుండునా యను సందేహముగూడ గలుగవచ్చును. కాని యింతకన్న నెక్కువ దూరము ఈ

విషయమును నిర్ణయించుట సాహసము. మఱియు నిద్దఱును ఎవరి కెవరైనను గురువు కాఁగల సామర్థ్యముగలవా రనుటలో సందేహము లేదు.

## కన్నడ వచనకారులు

ఇతనివలెనే యోగమార్గము నాశ్రయించి శివ సాక్షాత్కారమునకై ప్రయత్నించినవారు కన్నడ వీరశైవులలో ననేకులు గలరు. వారిలో పెక్కురు తమ తమ యనుభవములను, సిద్ధాంతములను కొంత పద్యపు నడకగల 'వచనముల'లో వ్రాసినారు. బసవేశ్వరుఁడే యీ పద్ధతిని మొదలుపెట్టినవాఁడని తోఁచుచున్నది. వీరు సర్వజ్ఞ వేమన్నలవలె చిక్కని విషయములకెల్ల చేయి వేయరు. వేసినను నిర్వహించుకొనఁగల కవితాశక్తియు వారికి లేదు. ఇతరుల బాహ్యాచార ఖండనము, స్వమతమందలి భక్తి, శివపారమ్యమందలి నమ్మిక, శివయోగ సాధనపద్ధతులు—ఇవి వీరి వచనములయందు ప్రముఖముగాఁ గానవచ్చును. వీరిలో కొందఱు స్త్రీలును గలరు. మచ్చుకు రెండు మూఁడాంధ్రీకరించి చూపుదును—

(౧) "లోకపు వంకరను మీరేల తిద్దెదరు? మీమీ తనువుల నూరడింపుఁడు; మీమీ మనసుల నూరడింపుఁడు. పొరుగింటివారి దుఃఖమున కేడుచువారిని మెచ్చఁడు కూడలి సంగమదేవుఁడు."

(బసవేశ్వరన వచనగళు, శివానుభవ గ్రంథమాల, బిజాపుర, పు. ౧౯)

(౨) "నా దేహమును దండముగాఁ జేయవయ్యా; నా తలను సొర బుఱ్ఱగా చేయవయ్యా; నా నరములను తంతులను జేయవయ్యా; నా వ్రేళ్ళను పుల్లలుగా జేయవయ్యా; ముప్పదిరెండు రాగములు పాడవయ్యా; ఎదకొత్తుకొని వాయింపవయ్యా కూడలి సంగమదేవా!"

(పై. పు. ౩౦)

(3) "కొండపై నిల్లు గట్టుకొని మృగములకు వెఱచిన నెట్లయ్యా? సముద్రపు గట్టున నిల్లు గట్టుకొని నురుగుతరగలకు భయపడిన నెట్లయ్యా? సంతలో నిల్లు గట్టి శబ్దమునకు సంకోచించిన నెట్లయ్యా? చెన్న మల్లికార్జునదేవ! వినవయ్యా! లోకమునఁ బుట్టిన పిదప స్తుతినిందలువచ్చిన మనసున కోపింపక నెమ్మదిగా నుండవలెను."

(మహాదేవియక్క, కర్ణాటక కవిచరితె, ౨, భా. పు. ౧౯)

(౪) "ఏనుఁగును గాదని యెనుఁబోతు నెక్కిన నెవరేమి చేయుదురు? కస్తురి విడిచి బురదఁ బూసుకొన్న నెవరేమి చేయుదురు? పాయసము విడిచి మద్యము త్రాఁగిన నెవరేమి చేయుదురు? తెలిసి తెలిసి గుహేశ్వరుని శరణులతో వాదించిన నెవరేమి చేయుదురు చెప్పుమా మడివాళయ్యా?"

(వచనశాస్త్రసార, ౧ భాగము, పు. ౧౦౮)

వీ రందఱు మొత్తము మీఁద శివాద్వైతవాదులు. ఇట్టి వచనములు కన్నడ భాషలో లెక్కలేనన్ని కలవు.

ఇదిగాక విష్ణుభక్తిగల కన్నడ మాధ్వులలో పండితులట్లుండఁగా, పామరులలో సామాన్యమైన యీ వేష భాషలు, వాదములు, జాతిభేదములు మొదలగువాని ప్రాబల్యమును జూచి యసహ్యపడి, యీ భావములను తమ భక్తిని పాటలరూపమున వెల్లడిపఱచిన పురందరదాసు, కనకదాసు మొదలగువా రనేకులు గలరు. వీనినే 'దేవరనామము' లందురు. మనలో రామదాసు, త్యాగరాజు మొదలగువారి కీర్తన లిట్టివే. తత్త్వసిద్ధాంతములం దెంత భేదమున్నను మతాంతరులయెడ ద్వేషా

నూయాదు లున్నను, నిరర్థకకర్మములు, దంభాచారములు మొదలగు మతవాదుల దుర్గుణములపై కత్తిగట్టుటలో వీరందఱును చాల పనిచేసినవారు. పామరజనులలో నేఁటికిని నిష్కల్మష భక్తి, నమ్మకము, సౌశీల్యము మొదలగు గుణములు నిలిచి యుండుటకు వీరే కారణభూతులు గాని, సూత్రములు, భాష్యములు, వ్యాఖ్యలు వ్రాసిన పండితులు గారు.

## తిరువళ్ళువరు

మన యింకొక పొరుగింటివారగు అరవవారిలో చాలవ్యాప్తిఁగాంచిన తిరువళ్ళువరు నాయనారి 'తిరుక్కురళ్' అను గ్రంథముతో వేమన పద్యములను పోల్చి చూడవలయుననుట ప్రకృతోపన్యాసనిబంధనలలో నొకటి. కాని యిరువురికిని పోలికలు చాల తక్కువ. నాకు ద్రవిడభాషాజ్ఞాన మంతకంటె తక్కువ. కాని తెలిసినంతలో అతనినిగూర్చి కొంత సంగ్రహముగా విన్నవింతును.

తిరువళ్ళువరు చాల ప్రాచీనుఁడు. ఇతనికాలము క్రీస్తుశకపు మొదటి శతక మని యనేకులు తలఁచినారు. మద్రాసులోని మైలాపూరిలోనున్న వాఁడు. 'భగ వంతుఁ'డను బ్రాహ్మణునికి 'ఆది' యను చండాల స్త్రీకిని జనించిన వాడని కథ.* వళ్ళువరనువారు ఒక తెగమాదిగలే కావున ఇతనిపేరు పైకథలోఁ గొంత సత్య మున్నదని సూచించెడిని. ఇతని నిజమైన పేరేమో తెలియదు. నేఁతపని వృత్తిగా బ్రతికినవాఁడు. ఇతని భార్య వాసుకి. వీరిరువురి దాంపత్యము అపూర్వమై చాల సౌఖ్యావహమై యుండెడిదఁట.

ఇతఁడు వ్రాసిన గ్రంథము 'కురళ్'. 'కురళ్' అనఁగా ఒకవిధమగు చిన్న ఛందస్సు: ఆటవెలఁదిలో ఇంచుమించు సగముండును. ఇతని పద్యములన్నియు ఆ ఛందస్సులో నున్నవి. ఇది ధర్మము, అర్థము, కామము అను మూఁడు పురు షార్థములనుగూర్చి మూఁడు భాగములుగా వ్రాయఁబడిన యుపదేశ శాస్త్రము. తాను బ్రాహ్మణుఁడు గాకపోవుటచే నధికారములేదని యితఁడు మోక్షమునుగూర్చి వ్రాయక వదలెననికథ. కాని ఉపోద్ఘాతమందలి పద్యములలోను, సన్న్యాసధర్మ ప్రకరణమునందును, భగవంతునిగూర్చియు, మోక్షోపాయములను గూర్చియు, సంగ్రహముగానైనను వ్రాసియే యున్నాఁడుఁ గావున ఆ కథ మనము నమ్మఁబని లేదు. మఱియు ఇతఁడు సుఖియైన సంసారిగానుండి, గృహస్థధర్మములగు అతిథిపూజ మొదలగునవి జరుపు కర్మనిష్ఠుఁడై, సత్యము, నీతి మొదలగు సామాన్య లౌకిక ధర్మముల నెక్కువ శ్రద్ధతో నెఱపుచు, దృఢమైన దైవభక్తిగలవాఁడై యున్న వాఁడంతేకాని వేదాంతవిషయముల నెక్కువగా పరిశీలించినవాఁడు కాకపోవచ్చును. ఇతఁడు పై ధర్మార్థకామములో నొక్కొక్కదాని యంగములను ప్రత్యేకముగా విభాగించి ప్రతివిషయమునకు పదిపద్యముల ప్రకారము మొత్తము ౧౩౩౦ పద్య ములు వ్రాసెను. గ్రంథకర్తయొక్క విషయ విభాగ శక్తిని సూక్ష్మదృష్టిని ఇందుఁ జూడవచ్చును.

దీనికి తోడు చక్కని కవితాశక్తియుఁ గలదు. అనఁగా వేమన్నవంటి యాశుధారగాదు. తిక్కనవలె నెమ్మదిగ చెక్కి చిక్కఁగఁ దీర్చిన రచన యితనిది.

---

* 'కురళ్' తెనుఁగగు 'త్రివర్గదీపిక' పీఠికలలో, అత్యద్భుతములైన గాథలు ఇతనిని గూర్చి కలవు కాని యది శుద్ధ పురాణము.

భావములందును అతనియుద్రేక మితనికి లేదు. మార్దవము, ఓర్పు, నెమ్మది యిందుఁ గానవచ్చును. కావుననే వేమన పద్యములవలె నొకమాఱు విన్నంతనే యిది బాణమువలె నెదలోఁ దూఱదు. సూత్రమువలె పలుమాఱు మననము చేయ వలయును. హిందూదేశమందలి యన్ని ధర్మశాస్త్ర గ్రంథములందును గానవచ్చు అహింస, సత్యము, వైరాగ్యము, శాంతి, దాంతి, అతిథ్యము, రాజధర్మములు మొదలగువానినిగూర్చి యందఱును ఆదరింపఁదగిన సామాన్యనీతుల నితఁడు వ్రాసెనేకాని యిందు క్రొత్తదేమియులేదు. కాని వాని నితఁడు సంగ్రహించి, సారించి, ఏర్పఱిచి, చిత్రకారుఁడు బొమ్మనుచేసినట్లు, నలుప్రక్కలు నిదానముగాఁ బరీక్షించి, ఎక్కువతక్కువలు దిద్ది, తీర్చి, నెమ్మదిగా కవిత్వపు మెఱుఁగులిచ్చి, పరిపూర్ణముగా బైటఁబెట్టినవాఁడు. కాని, ప్రాచీనులందఱివలె పై విషయములను మితిమీఱి చీలికలుగా విభజింపఁ బూనుటచేతను, ప్రతివిషయము మీఁదను పది పద్యములు తప్పక వ్రాయవలయునను నియమముచేతను, అందందు కవితాశిల్పము పలుచనై చప్పిడియైనట్లు కానవచ్చును.

వేమన్న విరక్తకవి. ఇతఁడు సంసారికవి. కావుననే యతఁడు చిన్న బిడ్డలు 'మురికిముద్ద'లని 'ముద్దఁ జంకబెట్టి ముద్దాడనేలరా?' (వే.జ్ఞా, ౧౧౧౨) యని యసహ్యపడి మొగ మావలఁ ద్రిప్పుకొనఁగా, ఇతఁడు—

"చిన్న బిడ్డలు చిఱుఁగేలఁ జెఱిచినట్టి
బోన మమృతంబు కంటె నింపొనుగాదె?" (స్వాంధ్రీకృతము)
(కురళ్, అఱత్తుప్పాల్, పుదల్వరైప్పెరుదల్ ౪)

అనెను. వేమన స్త్రీవ్యక్తిని తిరస్కరించి విధిలేక దానికి లోఁగినట్లు తోఁచును; తిరువళ్ళువరు స్త్రీయెడ చాలగౌరవముతో అభిమానముతోఁ గూడినవాఁడు. "తమకు ప్రియులైనవారి కౌఁగిలికంటె తామరకంటి దేవుని లోకమందును ఏమి సుఖము గలదు?" అని యితని ప్రశ్న (కురల్, కామత్తుప్పాల్, పుణర్చి మహిళ్దల్ 3). ఈ కారణముచేతనే యితనిని తిరస్కరించిన వారెవరును లేకపోవుట యట్లుండఁగా ననేకులు పండితులు దీనిని పొగడి వ్యాఖ్యానములు వ్రాసిరి. ఇది ప్రమాణగ్రంథ మయ్యెను. ఉత్తరవేదమని, దైవనూలని దీనికి పేళ్ళు గలిగెను. సుమతిశతకపు కర్తయైనను 'శ్రీరాముని దయచేతను' అని యుపక్రమించుటచేత, శ్రీరామ ద్వేషులెవరైన దానిని దిరస్కరింపవచ్చునుగాని, యితఁడు, 'నామలింగానుశాసనము' వ్రాసిన యమరునివలె, ఏ దేవతను పేరుతోఁ బిలువక, 'ఆదిభగవంతునికి' నమస్కరించి గ్రంథముపక్రమించి, అందు ఏ మత పక్షపాతమును జూపక, సర్వమత సాధారణములగు శాశ్వత నీతులను గూర్చి మాత్రము వ్రాయుటచేత, అందఱికిని కావలసిన వాఁడయ్యెను. కావుననే యీగ్రంథము ౧౫౦ ఏండ్లకు ముందే 'లాటిను' భాషలోనికిని, తరువాత, జర్మన్, ఫ్రెంచి, ఇంగ్లీషు భాషలలోనికిని పాశ్చాత్త్యులు పరివర్తించుకొనిరఁట.* నేఁటికి నలువదేండ్లకు వెనుకనే 'త్రివర్గ దీపిక' యను పేరుతో కనుపర్తి వెంకటరామ శ్రీవిద్యానందులనువారు దీనిని తెలుఁగులో మొదటి రెండు ధర్మార్థకాండములు పరివర్తించి ప్రకటించిరి. ఆంధ్రులు దాని నెక్కువ గమనించినట్లు కానరాలేదు. సహజమే. ఎందుకనఁగా, ఆంధ్రీకరించినవారికే యది యితరులకర్థము కాదని గట్టినమ్మకము కలుగుటచే,

---

* See V. V. S. Iyer's Preface, LXIII.

వారే దానికి వ్యాఖ్య, దానికి తాత్పర్యమును వ్రాయవలసివచ్చెను. ఇట్లు వ్యాఖ్యతో నాంధ్రీకరణమును దానితో మూలమును అర్థముచేసికొనువఱకును నిలిచియుండఁ గల కవిత్వమును రచింపఁగల్గినవాఁడు ఈ ప్రపంచమున నింకను బుట్టలేదు. ఇది గాక శ్రీ గరిమళ్ళ సత్యనారాయణగారు తెనిఁగించిరఁట కాని యింకను నది వ్రాఁత లోనే యున్నట్లున్నది.* దీని చక్కని యాంధ్రీకరణ మొకటి తెలుఁగు భాషకు త్వరలో తెచ్చుకొనుభారము మనపై నున్నది. అదియట్లుండె.

సామాన్యములగు నీతులవిషయమునఁ దప్ప వేమన్నకు నితనికిని పోలికలు చాలలేవు. అతఁడు దుర్నీతి నెక్కువగా ఖండించినవాఁడు; ఇతఁడు నీతియిట్టి దని చెప్పినవాఁడు; అతనిది విరక్తి; ఇతనిది రక్తి. అట్లుగాక వేమన్న అన్వయ మార్గమునఁ జెప్పిన నితనివలెనే చెప్పను. కాని యాపోలిక యిరువురు మనుష్యు లకు మనుష్యత్వమును బట్టి పోలిక యున్నట్లు. అపకారము చేసిన వానికిని ఉపకారము చేయుటయే మంచిది. ఇంటికివచ్చిన యతిథి నాదరింపవలయును; అసత్యములాడరాదు—ఇత్యాది విషయములలో ఏనీతి శాస్త్రకారుఁడును వేఱు విధముగాఁ జెప్పఁడు. కావున ఇట్టి వానిలో నీయిరువురను పోల్చి చూచుటకంటె తిరువళ్ళువరునుండి రెండు పద్యములు యథాశక్తి తెనిఁగించి చెప్పి యాతని విషయము చాలింతును:

నిష్కల్మషత్వము

"మనసునిల్పుకొనుండు మసిలేక, ధర్మ
మన నిదె; యొండెల్ల నాడంబరంబు"

(అఱత్తుప్పాల్, అఱన్ వలియురుత్తల్, ప. 3)

ఆతిథ్యము

"అతిథులకుఁ బెట్టి మిగిలినదారగించు
నరునిపొలమున విత్తులు నాటవలెనే ?"

(అఱత్తుప్పాల్, నిరుందోంబల్, ప. ౫)

శాంతి

"ఓర్వవలయు నెప్పుడొరులతప్పులు; వాని
మఱచుటింతకంటె మంచిగుణము"

(అఱ. పొఱైయుడైమై, ప. ౨)

స్త్రీ వర్ణనము

"కనియు వినియు మూరుకొనియును తాఁకియు
తినియు నెఱుఁగఁదగిన తీపులెల్ల
బెరసి నిలిచినవిర! మెఱుఁగుగాజులతోడి
తళుకులాఁడి దీని తనువునందు"

(కామత్తుప్పాల్, పుణర్చి మహిళ్దల్, ప. ౧)

---

*Vide, 'Maxims of Thiruvolluvar' by V. V. S. Iyer, Preface XX. తిరువళ్ళువరును గూర్చిన యనేక విషయములిందుండియే గ్రహించితిని.

ఇతరులమాట యిట్లుండఁగా తెనుఁగువారిలోనే వేమనవంటివారు పలువు రున్నారు. వేమనవంటివారనఁగా అతనిమతమువంటి మతము నాశ్రయించిన వారు; బహిరాడంబరములను వదలి, జాతిభేదాదులను తిరస్కరించి, యోగసాధనముచే అద్వైతమును సాధించినవారు; లేక సాధింపఁ దలఁచినవారు—అట్టివారిలో నొకఁడు—

## పోతులూరి వీరబ్రహ్మము

జాతిచే నితఁడు కంసాలి. ఇతని కాలము సుమారు పదునేడవశతాబ్ది మధ్యము. వేమన్నను గూర్చి మనము నిర్ణయించిన కాలమే సరియైనచో నితఁ డతనికి సమకాలికుఁడగును. స్థలము పోతలూరు. కర్నూలు మండల మందలి బనగానపల్లెలోనుండిన గరిమరెడ్డి వెంకటరెడ్డి యను నాతని యింట ఇతఁడు చిన్నప్పుడు పసులఁ గాచుచుండెను. ఆ వయసునందే యితఁడనేకాద్భుత కార్యములు చేసెను. చచ్చినవారిని బ్రతికించెను. ఊరిదేవరజాతరలో యితని యాజ్ఞ ప్రకారము అందఱియెదుర చండికావిగ్రహము లేచివచ్చి యితనికి చుట్టకాల్చు కొనుటకు నిప్పుదెచ్చి యిచ్చెనఁట! ఈతఁడును విగ్రహారాధనలు, జాతిభేదములు, జాతరలు మొదలగువానిని ఖండించి ప్రజలకు హితోపదేశము చేసెను. ఇతఁడు సన్న్యాసిగాఁడు. గొప్ప సంసారి. భార్య గోవిందమ్మ. ఐదుగురు కొడుకులు, ఒక్క కూఁతురును ఉండిరి. ఇతని శిష్యులందఱిలో దూదేకుల సిద్దయ్య ప్రసిద్ధుఁడు. పండ్రెండేండ్ల చిన్నవయస్సునందే తన మహమ్మదీయ మతమును తల్లిదండ్రులను వదలి వీరబ్రహ్మము నాశ్రయింపఁగా, అతఁడును నిరాక్షేపముగా నితనిని శిష్యునిగా నంగీకరించి బోధించెను. ఈ గురుశిష్యుల భక్తి వాత్సల్యములు చాల మనసును కరఁగించునట్టివి. శిష్యుని కొఱకితఁడు 'సిద్దబోధము' అను గ్రంథమును వ్రాసె నఁట. అందులోని వీ క్రింది రెండు పద్యములు :

"క. నీవును నేనును తానును
భావింపఁగ నొక్కఁడనుచుఁ బరఁగెఁడు గాదే
నీవును నిన్నెఱిఁగినచో
నీవేయఁగు దాను నేను నిజముగ సిద్దా!"

"క. నీలోన వెలుఁగు నెయ్యది
నాలోనను వెలుఁగునదియె సఖిలంబున దా
నాలోకనంబు గలిగిన
నీలోననె గాంతువయ్య నిజముగ సిద్దా!"*

ఇతఁడును వేమన్నవలె సర్వసమత్వముగల యద్వైత విద్యను బోధించు పెక్కు పద్యములను పాటలును వ్రాసినట్లున్నది. కాని నా కవి యెక్కువగా లభింప లేదు. 'పోతులూరి వీరబ్రహ్మముగారి నాటకము' అను గ్రంథమున కొన్ని కలవు గాని యవి నాటకకర్త వ్రాసినవో, వీరబ్రహ్మము వ్రాసినవో చెప్పలేను. ఒకటి మచ్చుకు—

---

*బెజవాడ టి. వి. రాఘవాచార్యులు గారు ప్రకటించిన 'వీరాచార్య చరిత్రము', పు. ౧౭. ఇందలి విషయము లీగ్రంథమునుండియే గ్రహింపఁబడినవి. ఇది గాక తప్పుల తడకల గుజిలీ ప్రతి యొకదానిలో కొన్ని పాట లిటీవల చూచితిని.

రాగం : మధ్యమావతి - ఆదితాళం

"సంసారైనా వకటి—సంసారము విడిచిన నొకటి. (పల్లవి)
హంసనటించే విధమెఱిఁగుంటే సంశయములు తనమది విడిచుంటే, సం॥
"ఇలవార్తలు వినకుంటే – తన – యింద్రియములు వశముంటే
కలలోమఱవక యుంటే మరి కల్లలన్ని తొలగుంటే, సం॥
"నిలుకడ శాంతంబుంటే – తన – నిజసమాధిగలిగుంటే
పలుమరుయోగుల భాషలు వినుచును, చలముమఱచి తానిలుకడయుంటే...

(వీరబ్రహ్మముగారి నాటకము, పే. ౬౧)

ఇదిగాక 'వీరాచార్య చరిత్ర' మందు ఈ క్రింది పదపుతునక యొకటి యుదాహరింపఁబడినది :

"చిల్లరరాళ్ళకు మ్రొక్కుచునుంటే చిత్తము చెడునుర వొరేవొరే !
చిత్తమునందలి చిన్మయజోతిని చూచుచునుండుట సరేసరే
వొక్కప్రొద్దులని యెండుకనుంటే వొనరగ చెడుదువు వొరేవొరే"

(వీరాచార్య చరిత్రము, పే. ౭)

పై పద్యములు చూడఁగా, వేమన కవిత్వము నందున్నంత వేగముగాని ఆ యచ్చుకట్టుగాని యిందులో లేదని తెల్లమగును. కాని సామాన్యజనుల కింత మాత్రము చాలును. దీనికితోడు వ్రాసినవాఁడు విరక్తుఁడై హఠయోగసిద్ధుల వింతలఁ జూపిన మహనీయుఁడగుట, అతనిపదము లనేకులు పాడుచుండుటకును, అతని ననేకులు పూజించుచు ఉత్సవాదుల నిప్పటికిని జరుపు చుండుటకును కారణమయినది. కటార్లపల్లె తుంగవేమన్న యిట్టివాఁడేకదా? వీరబ్రహ్మము సమాధియును స్థాపించిన మఠమును 'కందిమల్లయపాళెము' లోఁగలదట. ఇతఁడును సజీవముగా 'సమాధి'లోఁ ప్రవేశించిన వాఁడే. ఈతని పౌత్రియగు నీశ్వరమ్మ యను నామెయు బ్రహ్మచారిణి యగు యోగినిగా నుండి ప్రసిద్ధిగాంచెనఁట. ఈశ్వరమ్మగారి మఠము నాయూరనే కలఁదట. ఇతని శిష్యుఁడు దూదేకుల సిద్దయ్యయు ఇట్టివే కొన్ని పాటలు వ్రాసెను. ఈతని విషయమగు స్తోత్రములు సంస్కృతభాషలోఁ గలవు.*

## ఏగంటివారు

ఇట్లే అద్వైతమును బోధించుపాటలు 'ఏగంటివారి వచనాలు' అను పేరు గలవి మద్రాసు ప్రాచ్యలిఖిత గ్రంథ మందిరమునఁ గలవు.†

ఏగంటివారెవరో ఒకరో అనేకులో యే యూరివారో యెప్పటివారో తెలియు నవకాశము నాకు లభింపలేదు. కొన్ని గుజిలీ ప్రతులలో నీ పాటలు కొన్ని 'యేగంటి లక్ష్మయ్యగారి వచనాలు' అని ముద్రింపఁబడినవి. ఆంధ్రదేశమునందు వీని కెక్కువ వ్యాప్తికలదని వినుచున్నాను. జనులలో నెక్కువ వ్యాప్తిని గాంచుటకును మననము చేయుటకును పద్యములకన్న పాటలెక్కువ పనికి వచ్చునను తత్త్వమును పండితు లనేకులు గమనింపలేదు గాని, పామరులు మాత్ర మెఱిఁగి యాచరణకుఁ దెచ్చిరి. అట్టి పాటలలో సామాన్యముగాఁ గానరాని భాషాసౌష్ఠవము, విషయమును సంగ్ర

*చూ. వీరబ్రహ్మ నాటకము, పే. ౮౭.
†శ్రీ వే. ప్రభాకరశాస్త్రిగారు నాకివి చూపిరి.

హించి చెప్పుశక్తి, ధారాళమైన శయ్య—ఇవి యీ యేగంటివారి పదములలో ఎక్కువగాఁ గానవచ్చును. ఒకటి యుదాహరింతును :

"ప॥ ఆనందమయుఁడు గావలెను.
మనసు పదిలము సేయవలెను; ఈ
తనువులోపలి తెలివి తానె కనవలెను.
కనుచూపు లొకటి కావలెను, అందు
మన చిదానందలింగము గానవలెను. ॥౧॥

"వాయువుల కుంభించవలెను, మిక్కిలి యు
పాయమున కుండలిని పైకెత్తవలెను.
తోయజంబులు దాఁట వలెను; అందు
పాయకుండెడు నాదు పలుకు వినవలెను. ॥౨॥

"మూఁడుయేరులు దాఁట వలెను; అందు
జోడు బాయని గురుని జాడ గనవలెను;
మేడ మీఁదికి చొర వలెను; అందు
జోడుబాయని హంస జాడ గనవలెను. ॥3॥

"రేయు పగలొకటి గావలెను; అందు
వేయి రేకులమీఁది వెలుగు గనవలెను;
ఆ యెడను హంస గావలెను; ఆత్మ
బాయకేగంటి గురు పదవి గనవలెను, ఆనంద॥" ॥౪॥
(ఓ. లై., ౧3-౬30)

కన్నడమందలి 'దేవరనామముల' వలె తెలుఁగులో ఇట్టి అద్వైతబోధకములగు పదములు లెక్కకు మీఱి కలవు. ఇవి గాక ఇట్టి వేదాంతమునే పద్యరూపముగ వ్రాసిన శతకకర్తలు అసంఖ్యులు. శ్రీ వం. సుబ్బారావుగారు ఇట్టి వారిని సుమారేఁబది మందిని పేర్కొనిరి (వం. సు. వేమన, పు. ౧౮౭). ఇట్టివారిలో నొకఁడగు :

### ఆనంద వరదరాజయోగి

రచించిన 'సదానంద యోగిశతకము' నుండి రెండు పద్యములు—

"తే॥ స్నానమొల్లఁడు దేవతార్చనము సేయఁ
డమల విజ్ఞాన సంపన్నుఁ డైనయోగి
లోకులకు తెలియునె వానిలోని గుట్టు?
సద్వ్రతర భోగి శ్రీ సదానందయోగి!" (౨౪)

"బ్రాహ్మల మటుంచు కొందఱు పలుకుటెట్లు?
బ్రహ్మ నెఱుఁగంగ నేరక బ్రాహ్మఁడగునె?
బ్రహ్మ నెఱిఁగిన వాఁడెపో బ్రాహ్మణుండు, సద్వ్రతర..." (౬౬)

ఆధునికులలో వేమన్నయం దెక్కువ భక్తిగలిగి యతని పద్యములనేకము చేర్చికూర్చి 'వేమన జ్ఞానమార్గ పద్యము' లను పేరఁ బ్రకటించినవాఁడును, నెల్లూరి జిల్లా నారాయణరెడ్డిపేట రామస్వామియోగి కుమారుఁడు, దిగంబరయోగి శిష్యుఁడును అగు—

## ముత్యాల నారసింహయోగి

'జీవతత్త్వ ప్రబోధ కుసుమావళి' యను పేర నీ వేమన మతమునే ప్రకటించుచు చక్కని కందపద్యములతో గ్రంథ మొకటి వ్రాసెను.

వీరందఱికిని యోగశాస్త్ర పరాయణమగు అమనస్కసమాధియు పరతత్త్వ సాక్షాత్కారమును ఎంతవఱకు లభించినదో లభింపనేలేదో చెప్పలేము. ప్రథమావస్థ ననుభవించిన సాధకులును, వట్టి నమ్మికచే వ్రాసిన భక్తులును వీరిలో నెందఱో యుండవచ్చును. రామకృష్ణ పరమహంసుఁడు, వివేకానందుఁడు మొదలగు వారి యనుభవములపై, మాటలపై నమ్మిక గలిగి, తమకట్టి యనుభవమేమియు లేకున్నను ఆ విషయముపై నుపన్యాసములిచ్చి బోధించువారు మనలో నెందఱు లేరు ?

ఇంతటితో నేఁటి యుపన్యాసము ముగింపవలసినదే కాని రామకృష్ణపరమహంసుని పేరెత్తిన తరువాత నూరక దాఁటిపోవ సాధ్యములేదు. ఇదివఱకుఁ జెప్పిన యోగు లెల్లరును తమతమ దేశముల యెల్లలు మీఱినవారు కారు. కొందఱు తామున్న యూరే దాఁటి బైట వచ్చినట్లు తోఁపదు. కాని శ్రీరామకృష్ణుఁడు భరతఖండమందే కాక ఖండాంతరములందును కీర్తిగన్నవాఁడు. కడచిన శతాబ్దమున (౧౮౩౬) వంగదేశమున సామాన్య బ్రాహ్మణ కులమున జనించి, ఎక్కువ చదువు సంధ్యలు లేక, ఒకానొక కాళికాదేవి గుడిపూజారిగా నున్నవాఁడితఁడు. కాని సహజమైన యార్ద్రహృదయము, అధ్యాత్మిక తత్త్వములం దభిమానము, దైవభక్తియుఁ గల వాఁడగుటచే, ప్రయత్నములేకయే యితనికి దేవతాసాక్షాత్కారము మొదలగు అధ్యాత్మికానుభవములు తమంతట కలుగుచుండెడివఁట. ఉన్న దున్నట్టు చిన్న నాఁటినుండి యితనికి సమాధియనుభవము గలుగుచుండెనఁట. ఇతఁడు తాంత్రిక పూజలు, హఠలయాదిసాధనలు సక్రమముగానే యాచరించి తుదకు రాజయోగిగా పరిణమించెను. ఇతని జీవితమున జరిగినవని చెప్పఁబడు విచిత్రములకు లెక్కలేదు. హిందూదేశమందలి యన్ని మతముల ప్రకారమును ఇతఁడాచరించి తత్త్వానుభవ మును బొందెనఁట. ఇతనిని వట్టి పిచ్చివాఁడని యప్పుడును కొందఱు తలఁచిరి. ఇప్పుడును అట్లనుకొనువారు లేకపోలేదు. అది యెట్లున్నను, విజ్ఞాన ప్రధానమైన ఆంగ్లేయ విద్యను అభ్యసించిన వారనేకులు అధ్యాత్మిక ప్రపంచమందే నమ్మికలేక కేవల నాస్తికులైయున్న సమయమున, ఆస్తికతగలవారు హిందూధర్మములు మోక్షసాధకములు గావని తిరస్కరించి క్రీస్తుమతమునో లేక దాని రూపాంతరము లగు బ్రహ్మసమాజమునో, ఆర్యసమాజమునో ఆశ్రయించుచుండిన కాలమున, హిందువులలో ఆస్తికులనఁబడినవారు పరస్పర జాతి మత ద్వేషములతో వారికి మోక్షములేదని వీరును, వీరికి లేదని వారును తన్నులాడుకొనుచున్న సందర్భమున, ఈ మహాపురుషుఁడు జన్మించి, సగుణనిర్గుణోపాసనల వివిధ భేదములను తాను ప్రయత్నపూర్వకముగా సాధించి, సర్వమతములకు సార మొకటియే యనియు, దైవమని యొకటి సంగీకరించు ఏ మతమునందు శ్రద్ధతో నుపాసనచేసినను పరమ

ఫలమైన యద్వైతము లభించుననియు, నమ్మినట్లు తా నాచరించి చూపి, విజ్ఞానధనులైన వివేకానందుని వంటి వారి ననేకులను లౌకిక వైదికులను శిష్యులనుగాఁ జేసికొని, వారి మూలమున హిందూమత శాస్త్రముల మనతను యూరోపు, అమెరికా మున్నగు ఖండాంతరములందును చాటింపఁ జేయఁగల్గెను! ఇతని మతప్రకారము అద్వైతమే ప్రధానతత్త్వమని చెప్పుటకుఁగాని, ఖండించు టకుఁ గాని, నాకు శక్తిలేదని మొదలే విన్నవించితిని గదా? అదియెట్లున్నను, దేశమున కితఁ డనుగ్రహించిన గొప్పయుపదేశము: భిన్నమతములవారు ఒకరొకరితో కలహింప నక్కరలేదనుట. ఏ మతము నాశ్రయించినను ఫల మొకటియే కావున వారి వారి సంప్రదాయమునకు, ఇష్టమునకు తగిన మతము ననుసరింపవచ్చును. బహిఃప్రపంచమున శాంతిదాంతులుగలిగి, పరోపకారము, అనాథసేవ చేయుటయే పరమధర్మమని యితఁడు బోధించెను. సంఘసంస్కారము, మతసంస్కారము అను పేరుతో జాతిభేదములు, విగ్రహారాధన మొదలగు వానినెల్ల నొకటేమాఱు మూలముట్టుగ నశింపఁజేయఁ బ్రయత్నించుట పిచ్చిపని; అవియొకచోట నడంచిన వేఱొకచోట, ఒకరూపమును పాడుచేసిన వేఱొకరూపమున పైకిలేచును; దయ, దాక్షిణ్యము, భక్తి, సమ్మిక మొదలగు నుదారగుణములు ప్రజలలో పెంపొం దించినచో పై జాతిభేదాదులు తమంతట తమ బలమును గోలుపోవును. కావున వాని నడంచుటయందుఁగాని, స్థాపించుటయందుఁగాని శ్రద్ధవహింపక యుదా సీనముగా నుండుట యావశ్యకము. చండాలస్పర్శ చేసిన 'నాజన్మమే చెడిపోయెను, నేను ముక్తికి దూరుఁడనైతిని', అని నిష్కల్మషముగా నమ్మినవానిని బలవంతముగాఁ బట్టితెచ్చి మాలపల్లి మధ్యలో నిలిపినను, తిరుపతికిఁ బోయి దేవునికి 'పొంగలి సేవార్థము' చేయించిన నాకు ముక్తి లభించునని దృఢముగా నమ్మి తిరిపెమెత్తి కర్చుకు సంపాదించుకొని కాళ్ళనొప్పులు గమనింపక కొండయెక్కి పరమానందముతో దేవుని దర్శించి 'ధన్యుఁడైతిని గదా' యని కన్నీళ్ళు రాల్చువానికి 'ఇది వట్టి రాతిబొమ్మరా, దేవుఁడును గాదు, పయ్యమును గాదు. దీని కేల మ్రొక్కెదవు?' అని యెంత చెప్పినను, నీటి కెదురీఁదినట్లగును గాని ఫలము లేదు. వారి మనస్సు నెమ్మదిని జెఱిచినట్లగునింతె. ఒక యభిప్రాయము మనసులో స్థిరముగా నిలుచుట కెన్నాళ్ళు పట్టునో, దానిని పోఁగొట్టుకొనుట కంతకన్న నెక్కువ పట్టును—ఈ తత్త్వములను రామకృష్ణపరమహంసుని వలె, నే నెఱిఁగినంతవఱకును, ఇతర బోధకులెవరును గమనింపలేదు. ఈ జాతిభేదము మొదలగునవన్నియు తానును తుదిలో వదలినవాఁడే. కాని యితరుల నట్లుచేయుమని నిర్బంధించి తిట్టలేదు. నిర్బంధములతోను, దూషణలతోను శ్రద్ధ జనింపఁజేయుట యసాధ్యమనియు, అనావశ్యకమనియు ఖండించి యుపదేశించువానికన్న మౌనముతో నాచరించువాఁడు మంచి సంస్కర్తయనియు నీతఁ డెఱిఁగెను. బలవంతపు మాఘస్నానముతో పుణ్యము వచ్చునేమో కాని చలి విడువదుగదా!*

---

*పై రామకృష్ణపరమహంసుని జీవితచరిత్రవిషయములు 'The Life of Sree Ramakrishna' అను గ్రంథమునుండి సంగ్రహింపఁబడినవి.

శ్రీః

## ఏడవ యుపన్యాసము

# వేమన కవిత్వము, హాస్యము, నీతులు

వేమన కవులని పేరు సంపాదింపని కవులలోఁ జేరిన వాఁడంటిని. పేరు వచ్చుటకు రెండు హేతువులు: ప్రజయొక్క యభిరుచి నెఱిఁగి వారికి తృప్తిగా వ్రాసినవానికి వచ్చును; కవియొక్క గొప్పతనము నెఱుఁగఁగల ప్రజ యున్నను వచ్చును. వేమన విషయమం దీ రెండును లేకపోయినవి.

ఇతఁడు ఇతరులకు హితము గావలయునను నుద్దేశముతో వ్రాసెనే కాని, వారు తృప్తిపడవలయునని వ్రాసినవాఁడు కాఁడు. వారు తన్ను పొగడవలయునని, యాశపడి కాని, తిరస్కరింతురని వెఱచి కాని, తన త్రోవను వదలినవాఁడు కాఁడు. మనలో చాలనాళ్ళనుండి 'కావ్యం యశసేఽర్థకృతే' యను సిద్ధాంతము ముఖ్యముగా నెలకొన్నది. కావ్యములు వ్రాయుటకు మొదటి ఫలములు కీర్తి; ద్రవ్యము. కావున కీర్తినిచ్చు పండితులకును, ద్రవ్యమునిచ్చు రాజులకును ప్రీతిని గలిగించినచో కృతార్థుల మైతిమని యనేక కవులు తలఁచిరి. దానికిఁ దగినట్లు 'కవిసార్వభౌముఁడు' మొదలగు బిరుదులును, ఎకరాల కొలఁది యినాములును అగ్రహారములును వారికి లభించుచుండెను. తమ మనసుకు తృప్తి గల్గించినవారి విషయమున ప్రాచీనులు చూపిన మర్యాద, ఔదార్యము అత్యద్భుతములు. కాని కవికి స్వాతంత్ర్యము పోయినది. ఇతఁ డితరులచేతి బొమ్మ యైపోయినాఁడు. కృష్ణదేవరాయలవంటి దొరయాజ్ఞను తిరస్కరించి, 'ఊరక కృతుల్ రచియింపుమటన్న శక్యమే?' యని పెద్దనవలె ధీరముగాఁ జెప్పఁగల మగకవి లేకపోయినాఁడు. ఉన్న యభిరుచికి ఉదాహరణము లిచ్చువారే కాని, దానిని సరియైన త్రోవలో మార్చి తిద్దఁగలిగిన ధీరులు లేరైరి. క్రమముగా కవిత్వమునకు జీవనము సంపాదించుకొనుట యొక యానుషంగిక ఫలముగాఁ గాక, ప్రధాన ఫలముగా పరిణమించెను. ద్రవ్యము గలవా రెవ రే విషయమున పద్యములు వ్రాయుమని చెప్పినను 'సరే' యని కవి నడుముగట్టుకొని సిద్ధముగా నుండవలసి వచ్చెను. ఏ పెద్దమనుష్యుఁ డూరికి వచ్చినను, ఏ గుమస్తాను వేఱొక యూరికి మార్చినను, ఏ యెల్లయ్యకు దొరతనము వారి బిరుదు లభించినను, ఆ సందర్భములందెల్ల తప్పక, యేమూలలోనో యున్న కవిని జుట్టు పట్టుకొని యీడ్చుకొనివచ్చి, యందఱిముందుకు త్రోయుట విధిలేని పనియైనది. కవి యను పేరుగలవాఁడు ఎవ్వరిని జూచుటకు పోయినను, వాని యూరు పేరులు తెలిసికొని కలిపికొట్టి పద్యములు వ్రాసి పొగడుట ప్రథమకార్య మైనది. కవికి స్నేహము, ద్వేషము, భక్తి, అభిమానము, అసహ్యము మొదలగు తన భావము లేవియున్నను లేనట్లే, తిట్టుట కధికారము లేదు. పొగడ్తలకు విలువ లేదు; ఎందుకనఁగా, తాను తిట్టవలసియున్నను ఒకరు పొగడుమన్న వానిని పొగడ వలసినదే కాని, తన యిచ్ఛానుసారము కాదు గావున.

ఇట్టి కవిత్వమును వ్రాసి ప్రఖ్యాతిని సంపాదించుట వేమనవంటి వారికి రుచించునా? చూచిన వస్తువులందెల్ల తప్పులుపట్టు స్వభావము గలవాఁడు, పట్టిన తప్పులను స్పష్టముగా మొగము ముందర చెప్పక యుండలేనివాఁడు, ఇతరులను కీర్తికొఱకో, ద్రవ్యముకొఱకో ఊరక యెట్లు పొగడఁగలఁడు? ఒకని యందలి గుణములు తన మనసుకు నచ్చిన పక్షమున సంతోషించి పద్యములు వ్రాయు స్వభావము వేమన్నకు కలదని, గుంటుపల్లి ముత్తమంత్రి మీఁది పద్యము తెలుపుచున్నది. కాని అది, 'మా వాఁడు బుద్ధిమంతుడు' అని వాత్సల్యముతోఁ జెప్పు అభిమానపు మాట వలెనే యున్నదే కాని, యందులో ప్రపంచమందలి యందఱి తలవెంద్రుకలను తెలుపు చేయునట్టు ముత్తమంత్రి కీర్తి వర్ణింపఁబడినదా? లోకుల కెవరికిని త్రాగుటకు నీరును లేనట్లు, తెచ్చి పోసిన యతని దాన ధార వర్ణింపఁబడినదా? కాఁబట్టి యీ పద్యమును నెఱవాత యగు గుంటుపల్లి ముత్తమంత్రియే వినియున్నను, వేమన్న కొక గోటువక్కయు నిచ్చి యుండఁడు. తన దరిద్రావస్థలో ద్రవ్యార్జనకొఱకు బైలుదేఱినప్పుడు ఇట్లు ధనికులను పొగడి వేమన్నయు పద్యములు వ్రాసినాఁడేమో యను సందేహమును గలిగించు పద్య మొకటి గలదు—

"ఆ. పడుచు నిచ్చువానిఁ బద్య మిచ్చినవాని
కడుపు చల్లఁజేసి గౌరవమున
నడపలేనివాఁడు..." (౨౩౭౫)

తక్కినది మీరు పుస్తకమందే చదువుకొనుఁడు. కాని, యీ పద్యముగూడ, ఇట్లు ద్రవ్యము కొఱకు తన యాత్మను జంపుకొనియైన ముఖస్తుతిచేసి పద్యములు వ్రాసిన వానిపైఁగూడ 'అయ్యోపాపము' లేక, పట్టి చేతులతో పంపించు 'బండగొవు' లను తిట్టి వేమన వ్రాసినదే యనియుఁ జెప్పవచ్చును. ఇట్లగుటచే ఇతఁడు ఇతరుల కేది రుచించునని గమనించి, యీ ప్రకారము వ్రాయఁగల్గుట యసంభవము.

ఇదిగాక యితఁడు సహజముగా బహిరంగద్వేషి. అనఁగా దేని యందైనను ముఖ్యముగ గమనింపఁ దగినది. సారభూతమైన లోపలితత్త్వమే గాని, బైటి యాకారము, వేషము, పని మొదలగునవి కావనుట యితని సామాన్యదృష్టి. మనస్సు శుద్ధముగా నున్నఁ జాలును; బైటి స్నానపానాదు లక్కరలేదనువాఁడు. తాను గట్టిన 'చిఱుగుబట్ట' యే 'చీనాంబర' మని, తన 'ముఱికి యొడలే' 'ముక్తి' యని చెప్పుచు, ఆక్షేపించినవారి నదరఁ గొట్టిన వాఁడు. "భక్తిలేని పూజ ఫలము లేదు" గావున, అదికలవాఁడు దేవళములకుఁబోయి, పత్రి, తులసి కర్పుపెట్ట వలసిన పనిలేక 'మంచాననే మ్రొక్కు' (౨౩౨౮) నని చెప్పినవాఁడు కాని మంచము నందైనను 'మ్రొక్కుట' తప్పనిది గదా! అది బహిరంగమేకదా? బహిరంగము అంతరంగము రెండును ఒకటికొకటి యనుకూలములే కాని ప్రతికూలములు కావు. బలవంతముగా వానిని వేఱుపఱుప వచ్చునే కాని సహజముగా ఆ రెండును అన్యోన్యాశ్రయములు; ఒకటినొకటి వదలనివి. భక్తిలేక పూజచేయ వచ్చును; పూజలేక భక్తియు సాధ్యమే; కాని సహజముగాదు. అంతరంగము తనకు సంబంధించినది. బహిరంగము పరులకే యెక్కువగాఁ జేరినది; అనఁగా, తనకును అందు సంబంధము లేకపోలేదు. దానము చేయవలయునని యంతరంగ మందు బుద్ధియున్నఁ జాలునా! బహిరంగముగా చేయకున్న నితరులకు ఫలము లేదనుమాట యట్లుండనిండు. అసలు తనకు తృప్తి కలుగునా? హృదయము నిర్మలముగా నుండవలసినదే. కడుపులో అజీర్ణాదిమలములు లేకుండఁ జేసికొన

వలసినదే. కాని అంతమాత్రమున దేహము పైభాగము మురికి ముద్దయై చీరపేలు పడి క్రుళ్లుచున్నను తొందఱ లేదన వచ్చునా? ఇతరుల కసహ్యమనుట మఱచి పోదముగాక! మన ముక్కుకే యది యోర్వవచ్చునా? ఒక వేళ అట్లోర్చు కొనుట బలవంతముగా వాడుక చేసికొని బహిరింద్రియములను చంపుకొన వచ్చును గాని నిజముగా నది యుక్తమనవచ్చునా? కావున ఈ రెంటిని పరస్పరసహాయ ములుగాఁ జేసికొనుట బుద్ధిమంతుని లక్షణము మాత్రమే కాదు; సమర్థుని లక్షణము గూడ.

వేమన యిట్టి తప్పుసిద్ధాంతమును కొంతవఱకును కవిత్వమునందును ఉపయోగించెను. కవిత్వమునకు భాష, ఛందస్సు మొదలగునవి బహిరంగములు. అర్థభావములంతరంగములు. అవి ఒక విశిష్టవిధముగా తీవ్రముగా నున్ననే కాని కవిత్వమను పేరురాదు. చూడుఁడు:

"ఆ. పైరు నిడిన వాని ఫలమే సఫలమగు,
పైరు నిడనివాఁడు ఫలము గనునె?
పైరు నిడని వాఁడు బహుసౌఖ్యవంతుఁడౌ..." (౨౬౧3)

ఈ పద్యమందు కవిత్వములేదు. వేమన్న యిది వ్రాయకుండినను నష్టము లేదు. అట్లే బహిరంగములైన భాషాఛందస్సులును ఒక విశిష్టవిధముగా నుండనిది కవిత్వమనుపేరు రాదు. చక్కనిభాష, కుంటులేని ఛందస్సు గలిగియున్నను 'ఆంధ్రనామ సంగ్రహము' నందు కవిత్వమెట్లులేదో, యట్లే అర్థభావములు మంచి వైనను భాషాఛందస్సులు నాగరకతనుదప్పి యుండుటచేత నీక్రింది పద్యము నందును అదిలేదు:

"వుక్కుతండములైన పూదించి నలగొట్టి
వకటిగా జేయొచ్చు వసుధలోన
ఆత్మవేత్తైన వెనుక అంటించుటరుదురా... విశ్వ."
—కో. లక్ష్మణ మొదల్యారు గారి వేమనపద్యములు (౨౦౬౨)

వేమన యీపద్యము నిట్లే వ్రాసెనో వ్రాయలేదో యనుమాటవేఱు. అతని పద్యములనేకములు వ్రాఁతప్రతులలోను అచ్చుప్రతులలోను నిట్లేయున్నవి. అనేక పద్యములందు ఆటవెలఁది నడకకును, సీసపునడకకును భేదమే యితఁడు గమనించినట్లు తోఁపదు. భాషావిషయమందును శుద్ధమైన శబ్దప్రయోగమునకుఁగాని, సంధులను చక్కఁగా కలుపుటకుఁగాని, యితఁడు ప్రత్యేకముగ పరిశ్రమించినట్లే తోఁపదు. అచ్చులకును 'వ' కార 'య' కారములకును గలభేదమును పలుమాఱితఁడు గమనింపలేదు. 'సమశివయనవచ్చు నారాయణన వచ్చు' (౨౧౫౯) ఇత్యాది నిరర్గళ ప్రయోగములు పెక్కులు గలవు. ఇఁక అసభ్యములగు పదములు, అర్థములు, లెక్కలేనివి.

ఇఁక సామాన్యప్రజకు బహిరంగము ముఖ్యము. దేవళపుగోపురముల యెత్తు, దేవతకుఁగలనవరత్నాల సొమ్ములు, పూజారిమెడలోని తావళములసంఖ్య మొదలగు వానినిజూచి వానిమాహాత్మ్యమును వీనిభక్తిని నిర్ణయించువారు వారు. ఇట్లు కవి వ్రాసిన పద్యములు గూడ శుద్ధమైనభాష, పందెపు గుఱ్ఱము నడకవంటి ఛందస్సుఁ గలిగి, అనుప్రాస యమకాదులతో సభామందిరమును గడగడలాడించు నట్లున్న, 'బలే' యని మెచ్చుకొందురు. వేమనకవిత్వమందది యెక్కడిది?

మఱియు సామాన్యముగ కవిత్వమును విని సంతోషించు ప్రజలు రెండు

